Regd No. N. 45 / M. 3813

ప్రతి ఒక అణా

102 871

ఆఫ్రికాపై జర్మను విమానాలు

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

ఇటలీకి సైనికోద్యోగుల కరువు

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ మాఘ శు॥ ౧౦ (౫-౫-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౭౬

# జపాను చైనా యుద్ధంతో మెత్తబడినది

## చీనాలో జపాను పరాజయము

### బాధ్యత తనదేఅని ప్రధానమంత్రి ప్రకటన

చైనాతో పోరాటములో జపాను దాదాపు పూర్తిగా నలిగిపోయినట్లు ఇక చెప్పవచ్చును. ఈ వారంలో అన్నీ దానికి తగినవిదర్శనాలే కనిపించినవి.

జనవరి ౨౭వ తేదిన జపాను ప్రధానమంత్రి కోనోయీగారు జపానుశాసనసభయగు ప్రజాప్రతినిధిసభ బడ్జెటుకమిటీలో ఇట్లుచెప్పిరి:-

"చీనా జపానుయుద్ధములో అప్పుడే అయిదవయేడు ప్రారంభమయినను పరిష్కారసూచనలే వియు కనబడుటలేదు. ఇందుకు యుద్ధశాఖలబాధ్యతఏమీ లేదు. ఈ బాధ్యత మరెవ్వరిదీకాదు. నా ఒక్కడిదే. రాజాముందు, ప్రజలముందు నేను ఈ అపారధన, ప్రాణనష్టమునకై క్షమించరానివానినిగా కనబడుచున్నాను. ఈ పరిస్థితి చేయిమించిపోకుండ సర్వశక్తులతో ప్రయత్నించుటయే జపానురాజ్యానికి నేనుచేయగల తుదిసేవ"

ఎట్టిసంఘటనలనైనను ఎదుర్కొనుటకు జపానునౌకాదళము సమాయత్తమగుచున్నది" అని జపానునౌకామంత్రి అడ్మిరల్ కోషీకో గారు జపానుశాసనసభయగు ప్రతినిధులయొక్క బడ్జెటు కమిటీలో జనవరి ౨౭వ తేది ప్రకటించినాడు, నౌకాబలమునకై జపాను చేయుచున్న ఖర్చుకంటె అమెరికా సంయుక్తరాజ్యపు ఖర్చు చాలరెట్లుఅధికమని అతడు చెప్పెను. అమెరికానౌకల బలము ఎంతహెచ్చినజపానునౌకాబలము కూడఅంతహెచ్చునట్లు చేయబడునని, గుణం కాని రాశిప్రధానము కాదని చెప్పి, జపానునౌకానిర్మాణానికి ఎక్కువమొత్తము ఖర్చుపెట్టక అమెరికావారి బ్రహ్మాండమైననౌకాబలాన్ని ఎదుర్కొనుటకు క్రొత్తరకపునౌకలు కనుగొనపడునని వారుచెప్పిరి.

ఇదిఇట్లుండ ఉత్తరచైనా ప్రధాననగరమగు నాన్కింగులోనుండు వాంగుచింగువీగారి ప్రభుత్వాన్ని మాత్రమే చైనాప్రభుత్వమునితలచి చంగుకింగుప్రభుత్వముతో వ్యవహారము పెట్టుకోకూడదని జపానునిశ్చయించుకున్న విధానమును వదలిపెట్టుచున్నట్లు జపానువిదేశమంత్రి మత్సువోకాగారు జనవరి ౨౬వ తేది జపానుశాసనసభయగు ప్రజాప్రతినిధిసభయొక్క ఒకసబ్ కమిటీముందు సాక్ష్యమిచ్చుచు చెప్పెను. చీనాలోని రెండుప్రభుత్వాలను ఒకటిచేయుటకు జపాను ప్రభుత్వము ఇపుడు వాంగుచింగువీ గారితో ఆలోచించుచున్నదని మత్సువోకాగారనిరి. పోయిన నవంబరునుండి జపానుక్రొత్తచర్య ఏదియు గైకొనలేదని నొక్కిచెప్పి 'చంగుకింగుప్రభుత్వము తనతప్పుల నొప్పుకొని జపానుతో సంధిచేసుకున్నచో తానుప్రవాసశిక్షగాని మరణశిక్షగాని అనుభవించుటకు సిద్ధముగావున్నా' నని వాంగుచింగువీ చంకింగు ప్రభుత్వమునకు తెలియజేసినాడని మత్సువోకా గారు ప్రకటించిరి.

పసిఫిక్ ప్రాంతంలో అమెరికా సన్నాహాలను వ్యాఖ్యానించుచు "అసాహీషింబున్" అను జపానుపత్రిక, జపాను అమెరికాల పరిస్థితులు చాలాక్లిష్టపరిస్థితికివచ్చినవనియు, ఒకచిన్న నిప్పురవతో పెద్దమంటలులేవగలవనియు వ్రాసినది. చైనా, జపానులప్రాంతములలోని నౌకాశ్రయాలను బలపరచుటలో అమెరికా ఉద్దేశ్యము ఆర్థికముగ జపానును వేరుచేయుడమే అని ఈ పత్రిక వ్రాసినది. ఫిలిప్పైన్ దీవులను, గ్యామ్‌నుమాత్రమే కాక సింగపూరు, హాంగుకాంగుపోర్టుడార్విన్, నెదర్లాండువారి ఈస్టుఇండీసుదీవులనుకూడ ఉపయోగించుకొనుటకు అమెరికా ఉద్దేశించుచున్నదనియు పసిఫిక్ సముద్రముఅంతటిని తన అధికారముక్రిందికి తెచ్చుకొనవలెనను దురాశ అమెరికాకు తగదనియు ఈ పత్రిక వ్రాసినది.

జపానుయెడ అమెరికా వైఖరిని జపానువిదేశాంగమంత్రిమత్సువోకా గారు జనవరి ౨౬వ తేదిన చాలాతీవ్రము గాఖండించెను. అదేవిషయములో కొంచెము రాజీధోరణిలో ప్రసంగించినాడు. యూరపీయరాజ్యాలు గాని, అమెరికా రాజ్యాలు గాని జపానువారిఉద్దేశములను తెలిసికొని జపానువారిఆశయాలతో సానుభూతి చూపినట్లయితే, అట్టిసానుభూతిని, సహకారమును జపానుస్వీకరించును-అని తమప్రజాప్రతినిధిసభ బడ్జెటుకమిటీవారిఎదుట చెప్పెను తూర్పుఆసియాను జయించి జపాను నాయకత్వమును స్థాపించుకొనబోవుచున్నదని ఊహించుటతప్పనిరి. తూర్పుఆసియా ప్రాంతమునకుచెందిన వివిధజాతులును తమతమ అరస్థానాలనుఅలంకరించునట్లు జపాను చేయు కృషిపట్ల మానవకోటిసానుభూతి చూపునని తన విశ్వాసమనివారనిరి జపానుసామ్రాజ్య స్థాపనను దోహదము చేసినది ఈమహాశయమే, ఇదేమహాశయము మొత్తము తూర్పుఆసియాపునరుద్ధరణనుకూడవర్తించవలెను. ఇటలీజర్మనీలతో జేముచేసుకున్న ఒడంబడిక ఈమహాశయస్వరూపమే. ఇదే ఆశయమును అమెరికాసంయుక్త రాజ్యమువారు కూడా గ్రహించినచో అమెరికా ప్రభుత్వము తమదృష్టిని పశ్చిమార్థగోళముమట్టుకే కేంద్రీకరించుకోవలెను."

డచ్చిఈస్టుఇండీసునుంచి జపానుకుపెట్రోలు నెదర్లాండువారి ఈస్టుఇండీస్ దీవులనుండి జపానుకు మొదటఅనుకొన్న పరిమాణముకంటే ఎక్కువ పెట్రోలులభించినదని మత్సువోకాగారు ఒకప్రశ్నకు సమాధానములో తెలిపిరి స్పష్టంగా ఎంతపరిమాణముగ అనూనె లభించుచున్నది వారు తెలుపనిరాకరించిరి- ఈస్టుఇండీసుదీవులలోని పత్రికలో ఇటీవల అమిత్రధోరణినిగురించి మత్సువోకాగారు విచారపడిరి, "రాజకీయముగా ఆక్షేపణలను ప్రకటించి ఈస్టుఇండీసుధోరణిని చక్కపరచగలమనిరి.

ఇంతలోనే ఈస్ట్ఇండీస్ దీవులకుజపానుకొన్ని క్రొత్తషరతులు చేసినదని ఒకవార్తవచ్చినది. ఈ షరతులలో జపానువారు డచ్ ఈస్ట్ఇండీస్ దీవులలో సంచారంలుచేసి పరిశ్రమలనూ, చేపలవ్యాపారమును అభివృద్ధిచేయుటకుఈస్ట్ఇండీస్ ప్రభుత్వంఒప్పుకొనవలెననిఉన్నది, ఈషరతులకు డచ్ ప్రభుత్వము అంగీకరించు అవకాశములేదని మాస్కోరేడియో ప్రకటించినది.

తూర్పుఆసియాలో జపాను స్థాపించనున్న నూత్నవ్యవస్థలో ఈస్టుఇండీసు రాజ్యంకూడా చేరవలెనన్న సూచనను నెదర్లెండు ప్రభుత్వము నిరాకరించినది.

తూర్పుఆసియాలో యేర్పడు నూత్నవ్యవస్థకు ఏరాజ్యము నాయకత్వంవహించినను అందులో ఈస్టుఇండీసురాజ్యము చేరదట. టోకియోలోవున్న నెదర్లెండు రాయబారి జనరల్ ఫాస్టు జపాను ప్రభుత్వమువారికి అందజేసిన ప్రత్యేకసందేశంలో ఈప్రధానవిషయమును తెలియజేసినాడు. కాని జపానులో ఒకపత్రిక జపానువారు ఈసందేశమును లక్ష్యపెట్టరని వ్రాసినది.

#### క్రొత్తయుద్ధము

చైనాలో ఈశాన్యభాగానికిచెందిన దక్షిణ హోనాన్ రాష్ట్రంలోచేరివున్న ఒక లక్షమంది చైనీయసైనికులను ఖైదీలనుగా పట్టుకొనుటకు జపానువారు దాడిని ప్రారంభించినట్లును చైనావారు దానికిబదులుదాడి ప్రారంభించినట్లును జనవరి ౩౦వ తేదినాటి జపానుప్రభుత్వప్రకటనలు తెలుపుచున్నవి. చంకింగ్ లోకూడా తీవ్రమైన పోరాటముజరుగుచున్నది. ఈ యుద్ధంలోకూడ చైనావారే గెలిచి రానున్నారు. [illegible] జపానుగతి శోచనీయమే.

జపానుప్రజలకు ముఖ్యమైన ఆహారపదార్థము గు వరిబియ్యము ఇకమీదకోటాప్రకారము సప్లయి చేయబడబోవునని టోకియో [illegible] ప్రిఫెక్చర్

అధికారులు ఫిబ్రవరి ౧వ తేదిన ప్రకటించిరి ఏతారీఖునుండి ఇది అమలులోనికి రాబోవునో తెలియదుగాని ముమ్మందు అన్నికుటుంబాలలో విచారణజరుగును

విదేశీయ మారకపురేటును యుద్ధపరిస్థితులకు అనుకూలంగా సవరించుటకు జపానుశాసనసభ త్వరలో పూనుకొనును. ఈచర్యనుగురించి జపాను మంత్రివర్గం ఫిబ్రవరి ౨ తేదిఆలోచించెను.

#### ఆఫ్రికాలో ఇటలీ, బ్రిటనులయుద్ధము

ఆఫ్రికాలో ఇపుడు నాలుగురంగాలలో బ్రిటిషువారు ఇటాలీయులతోపోరాటములుచేయుచున్నారు అందు లిబియారంగములో జనవరి ౩౦ వ తేదిన డెర్నాపట్టణమందు బ్రిటిషు సేనలు ప్రవేశించినసంగతి పోయినసంచికలోచూచియున్నాము. అపట్టణమందలి ఇటాలీయసేనలు అక్కడినుండి పడమటిదిశకు బెంఘాజివైపునడువసాగెను. డెర్నాచిక్కుటవల్ల బ్రిటిషువారికి బెంఘాజికిపోవు రెండురోడ్లువశపడినవి

ఇరిట్రియారంగములో ఇటాలీయసేనలు ఉం హోగర్ నుండి పారిపోయినవి. ఫిబ్రవరి ౧ వ తేది నాటికి అగోర్డాటునుండి బారెన్టూకుపోవు ౫౫ మైళ్ళరోడ్డును బ్రిటిషుసేనలు భేదించి ఆరెండుచోటులలోని ఇటాలీయసేనలు కలియవీలులేకుండ చేసినవి. ఫిబ్రవరి ౧ వ తేదిఉదయం అగోర్డాటు పట్టణములో బ్రిటిషుసేనలుప్రవేశించినవి. ఈపట్టణము ఎరిత్రియారాష్ట్రపురేవుపట్టణమగు మసావాకుపోవు రైలుమార్గంలో మంచికీలకస్థానంలో ఉండునట్టిపట్టణము. ఈ అగోర్డాటునిపట్టుకొనుటకై జరిగినయుద్ధంలో బ్రిటిషువారికి అనేకఇటాలీయుసైనికులు ఖైదీలుగను, అపారశత్రుయుద్ధసామగ్రియుచిక్కెను. బారెంటూవద్ద పోరాటముజరుగుచునేయుండఇంకనుదక్షిణమునభాకండిపట్టణము బ్రిటిషుసేనలవశమైనది. అగోర్డాటునుండి ఇటాలీయసేనలు కెరన్ వైపు పారిపోవుచున్నవి. ఈచర్యఫలితంగా ఇటాలీయసేనలు వాకెయిటుజిల్లానుండిలేచి తూర్పుదిశగా కొండలలోకి ప్రయాణముచేయసాగినవి.

అబిసీనియాలోకికూడ బ్రిటిషుసేనలు దాడిని ప్రారంభించినవి. మెటెమ్మాప్రాంతములో బ్రిటిషుసేనలఒత్తిడికి ఆగలేక ఇటాలీయసేనలు అక్కడినుండి గోండారుకుపోవురోడ్డుపై పారిపోవసాగెను. బ్రిటిషుసేనలు వాటివెనుకతరుముకొనుచుపోవుచున్నవి టానాసరస్సుప్రాంతంలో ఇటాలీయసేనలను అబిసీనియానాయకులు వేధించుచున్నారు.

ఇటాలీయులసోమాలిలాండు సరిహద్దువద్ద బ్రిటిషుసహాయసేనల దెబ్బలుతిని ఇటాలీయసేనలు ముందుండే స్థానాలనువదలి వెనుకకుచేరినవి.

కెన్యాప్రాంతంలో మొయేలువద్ద బ్రిటిషు సేనలకును ఇటాలీయసేనలకును తీవ్రమైనపోరాటము జరుగుచున్నది: సోమాలిలాండులో బ్రిటిషుసేనలు ప్రవేశించినవికియాంచోనినుండికూడ ఇటాలీయులను తరిమివేసినవి.

ఇకవిమానాలదాడుల సమాచారము ఇపుడు బ్రిటిషుసామ్రాజ్యసేనలకు సంబంధించిన విమానాలు ముఖ్యముగా ప్రతిరంగములోను ముందుముందు తమసేనలుపట్టుకొనవలసిన శత్రుస్థానాలనుండి శత్రువులు లేవగొట్టుటకును, వెనుకకు పారిపోవుచున్న శత్రువుల ఊపిరాడనివ్వకచేయుటకును, శత్రుసేనలకుఇతరస్థలాలనుండి సహాయము యేదియులభించకుండచేయుటకును అవసరమునఒక్కడివి చేయుటయందు శ్రద్ధవహించుచున్నవి. బ్రిటిషువారివిమానదళములతోపాటుదక్షిణాఫ్రికాయూనియను ప్రభుత్వమువారి విమానదళాలుకూడ ఈపనుల లోతోడ్పడుచున్నవి. బెంఘాజీకి పోవురైలుమార్గమునందుండుకోస్టులరాజ్యస్థానముపై బార్స్ సుఖ్రాముపై బ్రిటిషువిమానాలు జనవరి ౩౦, ౩౧వ తేదులలో బాంబులువేసినవి, అక్కడ ఇటాలీయులవిమానాశ్రయములను పాడుచేయుటయే ఈదాడి ఉద్దేశ్యము ౩౧వ తేదిన క్రిందనుండిన రెండు శత్రువిమానాలుమండిపోయెను, అక్కడమోటారు బండ్లపైకూడ బాంబులువేయబడినవి, బ్రిటిషు విమానాలను ఎదిరించుటకైపైకివచ్చిన ఒకశత్రువిమానమును బ్రిటిషువిమానాలు తరుముకొనిపోయి బెంఘాజికి దగ్గరనుంటల పాలుచేసినవి ౩౦వ తేదిన డెర్నానుండి బెంఘాజికిపోవురోడ్డుపైనుండు ఒకశత్రువిమానాశ్రయంపై బ్రిటిషువారు బాంబులువేసి తమనెదిరించవచ్చినఒకశత్రువిమానాన్ని కాల్చివేసినవి. ౩౧వ తేది ట్రిపోలిఅను సముద్ర రేవు పట్టణమువద్దబ్రిటిషువిమానాలువేసినబాంబులచే ఒకవర్తకపునౌకమండిపోయెను, మరొకటి దెబ్బతినెను తూర్పుఆఫ్రికాలో నెకానుండి నెఫెల్టికిపోవు రోడ్డుపైనుండు ఒకవంతెనను పాడుచేయుటకు బ్రిటిషువిమానాలు జనవరి ౩౧వ తేదిన బాంబులువేసినవి, ఇదేరోజు మొయేలులో ఇటాలీయసేనల స్థానాలపైనను, ఆయుధాలపైనను బాంబులనువేసినవి, ఈ రోజు ఒక బ్రిటిషువిమానంజాడ తెలియదు, అబిసీనియాలో ప్రధాననగరమగు అడిస్అబాబానుండి దిబేటికిపోవు రైలుమార్గంలో ఫ్రెంచివారి సోమాలిలాండు సరిహద్దునుండి ౩౦ మైళ్లదూరములోనుండు డైయెహాఅను స్టేషనుపై బ్రిటిషు విమానాలు బాంబులువేసి నాశనముచేయుటవల్ల అబిసీనియాలో ఒకచోటనున్న ఇటాలీయులకు మరొకచోటనుండు ఇటాలీయులతో సంబంధములేకుండచేయబడినది. దక్షిణాఫ్రికావారి విమానదళాలు ఫిబ్రవరి ౧వ తేదిన తూర్పుఆఫ్రికాలోని ఇటాలీయుల ప్రదేశాలపై బాంబులనువేసినవి.

ఇటాలీయవిమానాలు డెర్నారోడ్డుపైపోవుచుండిన బ్రిటిషుసేనల ఇగ్రదళములపై జనవరి ౨౯వ తేదిన మరతుపాకులుపేల్చినవి. ఆఇటాలీయవిమానాలలో ఇదివరలోలేని క్రొత్తరకపు విమానాలుఉండెను- ౨౯వ తేదిన బ్రిటిషువిమానాలు శత్రుసేనలెచ్చుటెచ్చుటనున్నని కనుగొనుటకై పోయినపుడు ఇటాలీయవిమానముల నెదుర్కొనవలసిరాగా, అపుడురెండు ఇటాలీయవిమానములుమండిపోయినవి. ఫిబ్రవరి ౧వ తేదిన మాల్టాపైకివచ్చిన ఇటాలీయవిమానాలనుండి ఒకదానిని అక్కడి బ్రిటిషువిమానము కూల్చివేసినది- ఇటాలీయవిమానాలు మాల్టాపై బాంబులను వేయలేదు.

#### అల్బేనియాలో ఇటలీ,గ్రీసుల యుద్ధము

అల్బేనియాలో ఇటాలీయులకును గ్రీకులకును జరుగుచున్నయుద్ధంలో ప్రతిరంగంలోను, పతితోజాన్న. ఇటాలీయసేనలు అదివరలో పోగొట్టుకున్న తమప్రదేశాలను తిరిగిగ్రీకులనుండి పట్టుకొనుటకై చేసినదాడులన్నియు గ్రీకుసేనలచే విఫలములుగ చేయబడుటయేగాక ఇటాలీయులు అపారనష్టముతో పారిపోవలసివచ్చెను, ఇంతవరకు అల్బేనియాలోని యుద్ధంలో ౬౦౦౦౦ మందికిమించిన ఇటాలీయులు గ్రీకులకు ఖైదీలుగ చిక్కియున్నారు. వచ్చినవార్తలలో గ్రీకులకుచిక్కినక్రొత్తస్థలాలపేర్లు వివరంగా తెల్పబడకుండుటలేదు, కానిప్రతిరోజు గ్రీకుసేనలు క్రొత్తస్థలాలనుపట్టుకొనుచున్నట్లు చెప్పబడుచున్నది. జనవరి౨౯వ తేదిన మధ్యరంగంలో ఒకముఖ్యస్థానము,౩౧వ తేదిన సముద్రతీర ప్రాంతంలోజరిగినఘోరయుద్ధంలో కొన్నిపర్వతశిఖరములు గ్రీకులకు జనవరి౨౯

౧౦ వ పేజి చూడుడు

## రేమిడిచర్ల

**మద్యపాననిరోధక ప్రచారము.**

ఈగ్రామంలో చ౹౩౻౮౼౫౦ఫ రోజుసా యంత్రం నాలుగుగంటలకు ఈగ్రామమద్యపాన నిరోధక సంఘమువారు బహిరంగసభను ఏర్పా టుచేసిరి, సభకు శ్రీయుతులు దేవంభొట్లరాధా కృష్ణమూర్తిశాస్త్రిగారు అధ్యక్షతవహించిరి. ప్రజలు ఎక్కువమంది రాజాలకపోయిరి కాని వచ్చిన కొలదిమందిద్వైనను మద్యపానమువలన గు అగునష్టముల బాగుగ నెరిగిరి. పనిబాటల దినములగుటవలన ప్రజాబాహుళ్యమున ప్రచారముజరిగిన దికాదు.

ఈరేమిడిచర్లగ్రామశివారు అయిన కొత్తపాలెంగ్రామములో చ౹౼౮౼౫౦ఫ. రోజుసాయంత్రము నాలుగుగంటలకు సభప్రారంభమై రాత్రి సుమారు ఏడున్నరగంటలవరకు ఉపన్యాసములద్వారా ప్రచారము బాగుగజరిగినది. ఈసభకు శ్రీయుత దేవంభొట్ల అనంతపద్మనాభశాస్త్రిగారు అధ్యక్షులైరి. ఈసభకు రెండుశ-దల మంది సోదరసోదరీమణులు వచ్చిరి.

చ ౬౼౫౼౧౩౫౦ ఫసలీరోజు కొత్తపాలెం గ్రామములో మరియొకసభ జరుగవలసియే యున్నది. కాని ఆరోజు మొహర్రం పదియవదినమగుటచే ముస్లింసోదరులకు తగుఅవకాశము నిచ్చుటకై అపుటకుద్దేశింపబడినది.

ఇట్లు
రేమిడిచర్ల భాషానిలయ కార్యదర్శి

---

**జీవరక్షక ప్రజామండలివారికి మరొక విజ్ఞప్తి.**

(స్వ. వి.) సూర్యాపేట ౩౧౼౧౼౪౧

దురాచిపెల్లిగ్రామము సూర్యాపేటతాలూకాలోనిది. ఇక్కడ 9 ఫిబ్రవరి 41 ఆదివారము సాయంకాలము వరకు గొల్లలందరు గుట్టనెక్కెదరు. రాత్రివారి మతచరిత్ర జరుగును. తెల్లవారి 7 గంటలవరకు వేలకొలది మేకలబలి యిచ్చెదరు. బలినాపుటకై సూర్యాపేట పౌరులనుండి ఒక విజ్ఞప్తిపత్రము హైద్రాబాదు (దక్కన్) లోని శ్రీ జీవరక్షక ప్రజామండలి కార్యదర్శిగారికి పంపియుండిరి

స్థానిక ఆర్యసమాజీయుడగు పండిత హనుమంతరావుగారు సిద్ధాంత రత్నగారు ముఖ్య గ్రామాలకువెళ్లి వారి ముఖ్యనాయకులతో కలిసి బలినాప ప్రయత్నించుచున్నారు,

## పశువుల జప్తీ

(స్వ.వి.) బూర్గుపల్లి, ౩౦౼౮౼౫౦.

ఈగ్రామము మెదకుజిల్లా అందోలు తాలూకాయందలిది. ఈవత్సరము వర్షములులేక పరిస్థితులభివృద్ధిపొందలేదు. సకాలమునకు పంటల నష్టపుదరఖాస్తులు పంపుకోబడినవి. పంచనామాలు న్యాయముగ జరుగలేదు. పన్నులదండుగలుపడినవి. రైతులు శ్రీ మండలాధికారివద్ద మురాఫాచేసినారు. కొంతభాగము మాఫీఅయినది. తక్కిన మాఫీకానివాటికై పునర్విమర్శచేయుటకై కోరబడినది ఇంతలో సెలవులువచ్చినవి. పని ఆగిపోయినది. తహసీల్ డివిజన్ ఉద్యోగులకు రైతులఆస్తుల జప్తులకైనేగేదార్లనుపంపితే రైతులయొద్దనున్నగుపశువులను జప్తిచేసి, తహసీల్ కు తీసుకవెళ్లిరి. రైతులు మేము మండలాధికారివద్ద మాఫీకై కార్యాయిజరుపుతున్నాము, కొంతభాగము మాఫీయైనది. శలవువెళ్లినదాక అగుమన్నను అగుటలేదు. పశువులు తహసీల్ కచేరీలో సరిగా తిండిలేక నీరులేక బాధ ననుభవించుచున్నవి రైతులు వాటియవస్థచూడలేక తాముకూడాతిండిలేక తహసీల్ కచేరీముందు పడిఉన్నారు.

## తాడికొండ జాగీరుప్రజల దురవస్థ

(స్వ. వి.) ౨౯౼౮౼౫౦ ఫ

ఈజాగీరు శ్రీశివరాజబహద్దూర్ స్టేటులోనిది ప్రస్తుతము శ్రీధర్మకరణ్ బహద్దూర్ గారి పరిపాలనలోవున్నది. ఇచ్చటి తహసీలుదారు, శేగేదార్లు, పటేలు పట్వారీలు శ్రీవారిని ఆహ్వానింపదలచి ప్రజలతో నజరానానిమిత్తమై ఫండువసూలు చేయుచున్నారు. ఇవ్వలేనివారితోసైతము బలవంతముగా వసూలుచేయుచున్నారు. పైరుపంట అనుకూర్చి ఈసంవత్సరము సర్కారీపన్ను చెల్లించుటయే యెంతోకష్టంగాజరుగుచున్నది:ఈఫండు వసూలుచేయుటలో రైతులకు తలదిమ్ముపట్టియున్నది. ఈఫండుఇవ్వలేక ప్రజలుచాల ఇబ్బందిపడుచున్నారని తెలియుచున్నది.

## హనుమకొండ

**రెడ్లలో అంతర్వర్ణ పునర్వివాహము**

(ప్రత్యేక విలేఖరి) ౨౫ ఇస్ఫందారు ౧౩౫౦ ఫ.

హైదరాబాదులో న్యాయవాదులగు, శ్రీ కోహెడ పుల్లారెడ్డిగారికిని, వరంగల్ జిల్లా లోకల్ ఫండు మొహతమీముగారగు శ్రీ రాంచంద్రారెడ్డిగారి మరదలగు శ్రీమతి శాంతాకుమారిగారికిని, ౨౭ ఇస్పందియారు తేదీన హనుమకొండలో వైభవోపేతముగా వివాహముజరిగినది. వరుడు రెడ్లలో గుడాటిశాఖకుజెందిన వాడగుటచేతను వధువు పాకనాటిశాఖకు జెందినదగుటచేతను, వధువు ఇరువదియొకటి సంవత్సరముల బాల్యవితంతువగుటచేతను, ఈవివాహమునకు, సంస్కరణదృష్టితో ప్రాముఖ్యతగలదు.

ఈవివాహమునకు కారకులైనవారందరు ప్రశంసార్హులు ముఖ్యముగా వధూవరులును, కన్యాదాతయగు శ్రీరాంచంద్రారెడ్డి మొహతెమీంగారును అభినందనీయులు సంప్రదింపులు జరిపికార్యసాఫల్యతకుదోహదపడిన, వరంగలు మార్కెటు మొహతెమీంగారగు శ్రీ రాజా ప్రతాపరెడ్డిగారును, కరీంనగరమునందు లోకల్బోర్డు ఓవర్సియరుగానున్న శ్రీ జె. లక్ష్మారెడ్డిగారును ఈసందర్భమున ముఖ్యముగా పేర్కొనదగినవారు. హైదరాబాదునగరమునుండెందరో రెడ్డిప్రముఖులు. స్థానిక రెడ్డిన్యాయవాదులును ఇతరమహాశయులును వివాహమునందుపాల్గొని జయప్రదంగా జరుపుటయందుదోహదమొసగిరి.

ఇటువంటివివాహములెన్నియో జరిగిననేగాని ప్రస్తుతపరిస్థితులయందు సంఘమును విచ్ఛిన్నము చేయుచున్న విభేధములు, దురాచారములుతొలగి సంఘాభివృద్ధిచేకూరజాలదు.

## బరాయిందా వసూళ్లవలని కష్టములు

(విలేఖరి) సిరిసిల్ల. ౨౦౼౮౼౫౦ఫ.

ఈతాలూకాలోని తాళ్ళపల్లిగ్రామంరైతులు కరీంనగరంవెళ్ళి తాలుక్దారు గారివద్ద బరాయిందా రకము యిప్పుడు మానుంచి వెళ్లజాలదనియు, బరాయిందాకొరకు మాకు గడువు యిప్పించవలయుననియు దరఖాస్తుపెట్టుకొనిరి. దానిపై తాలుక్దారు గారు వీరునిజంగా బీదవారేఅయినట్టయితే బరాయిందాకొరకు గడువివ్వవలయునని తహసీలుదారు గారికి అదరఖాస్తుపైననేవ్రాసిరి. రైతులు సిరిసిల్లకువచ్చి తహసీలుదారు గారివద్దికి పోయి తమకష్టస్థితిని చెప్పుకొని గడువివ్వవలెనికోరిరి. దానిపై తహసీలుదారు గారు రైతులను పైరాలో (హిరాసతు)నుంచుట కాజ్ఞాపించిరి. వారు అట్లే ఉదయం ౧౧గంటలనుండి సాయంకాలము ౬ గంటలవరకు పైరాలోనుంచబడిరి. వారు(రా)గురు ఉండిరి. అనాడే సాయంకాలము బరాయిందా వసూలు ఆపియుంచవలెనని ఉత్తరువులు వచ్చుటచేత ఆరైతులు వదలిపెట్టబడిరి. ౧౬౼౧౼౫౦ ఫ నాడు శ్రీ వరంగలు సూబేదారుగారు కరీంనగరంవచ్చి బరాయిందా వసూలు నాపివేయవలయునని ఉత్తరువులు జారీచేయించినారని తెలుస్తున్నది.

పైవిధముగానే గడువుఇప్పించవలెనని తాలుక్దారు గారివద్ద ఎన్నోగ్రామాలు రైతులు దరఖాస్తులుపెట్టుకున్నారనియు వాటి యన్నిటిపైనను పైదరఖాస్తుమీద వ్రాసినట్లే తాలూక్దారుగారు వ్రాసినారనియు, తహసీలుదారులు దానిని గమనించకుండానే ఇంకాకఠినంగా వసూలుచేసినారని తెలియుచున్నది.

## బుర్ధరాఘవపురం లంబాడీలు- దొంగతనాలు

ఇల్లందు తాలూకాకేంద్రమగు ఇల్లందుకు ౨౦ మైళ్ళదూరంలో బుర్ధరాఘవపురంఅను గ్రామము కలదు. ఇచ్చటలంబాడీలకు ఆదినుండియు చోరత్వంఅలవాటే, కానిస్వల్పం, అనగా మేకలు, కోళ్ళవరకేవుంటువుండెను. వీరిలోకొందరు శిక్షితులుకూడాకలరు. వీరుగత౫ఏంలో క్రిస్తుమతంలోచేరిరి. శ్రీ పాదిరీగారు శిక్షపొందినవారిని నిందితులపట్టికనుండి తీసివేయించ యత్నించుచున్నారు. కాని వీరిలోమతముపుచ్చుకున్నప్పటినుండి చోరత్వంఅభివృద్ధిజెందుచున్నది. గ్రామం చుట్టుపట్టు ౨౦-౧౦మైళ్ళవరకు వున్న గ్రామాలలో కూడావీరిచర్యలు యథాప్రకారంగావున్నవి. వీరు యిప్పుడుచేసేదొంగతనాలు యిండ్లకు కన్నాలువేయుట, జొన్నచేలలో కంకులుకూర్లుకోయుట, కావలికాచే బీదకూలీలవద్ద పంచలతోసహాదొంగిలించుట, యీతీరునఅనేకచోట్ల అనేకదొంగతనాలుచేయుచున్నారు. వీరిమతంపంతులు అయ్యవారితోచెప్పితే, "మా మతంలో చేరినవాండ్లు యిలాంటిదొంగతనాలు, నీచపువృత్తులు, చేయరు. అని మాతోచెప్పుదురు. కాన సర్కారువారు యీబీదరైతుల మొరలాలించ ప్రార్థన,

ఇట్లు
మోతూకూరు నారాయణ,
వడ్లమూడి శీతారామయ్య.

## గంగాపురం జాగీరు దురవస్థ

(స్వ. వి.) ౨౯౼౮౼౫౦ ఫ.

మొహర్రం సెలవులబట్టి ఈమాఘ శు ౭ లకు రథోత్సవముజరుపబడదు. దేవాలయములోనే కల్యాణోత్సవము సేవలీయప్రయత్నములు జరుగుచున్నవి. శనివారము శ్రీస్వామివారి సేవదీయుట మానివేసినారు.

**పాఠశాల దుర్గతి**

జాగీర్దారుగారు దేవాలయపు స్థానికాచార్యులను ఉపాధ్యాయునిగాఏర్పాటుచేసి పాఠశాలనడుపుటకు ఆజ్ఞయొసగెను ఆరుమాసములదాక ఉపాధ్యాయుడు వేతనములేకుండాపనిచేసి ఇప్పుడువిసుగుకున్నాడు. జాగీర్దారుతగువేతనము అతనికేఇచ్చి పాఠశాలఏర్పాటుచేసిన బాగుండును.

**టప్పా**

ఈటప్పాఖానా మొదటపరీక్షరీత్యా తెరువబడినది ప్రజలకు సకాలమునకు పత్రికలు, జాబులు అందజేయుటకు మనిషినిఏర్పాటుచేసియున్నారు. కల్వకుర్తికిపోవుబస్సులో జడచర్లనుండి గంగాపురం టప్పాపంపవచ్చును ఇట్టిఏర్పాటులు పూర్వము గావింపబడియుండెను. ఇప్పుడు మనిషి తనఇష్టమువచ్చినప్పుడు టప్పా జడిచర్లనుండి తెచ్చి ప్రజలకుపంచుచున్నాడట. కావున పత్రికాపాఠకులకు పత్రికలు సకాలమునకు అందుచుండుటలేదు.

**రోడ్ల నిర్మాణము**

సఫాయి రాస్త పట్టివిషయమై జాగీరుదారువకు రూ. ౧కి ఒకఅణాఇచ్చుచున్నారు. మొత్తము పన్ను రూ. (౧౭౦౦౦) పదహారువేలు వసూలగుచున్నది. కాని రోడ్లునిర్మించుటలేదు పెంటలు ఇండ్లపక్కలలోనే పోసుకొనుచున్నారు వీధులుసరిగా ఊడ్పించుఏర్పాట్లుకూడాలేవు. పరిశుభ్రతచాలాఅవసరమైవున్నది జడచర్ల కావురముపేట మొదలగు పరిసరగ్రామములలో ప్లేగుఆరంభించినది. ఇచ్చటకూడ ఎలుకలుపడుచున్నట్లు తెలియుచున్నది. జనులుక్యాంపులువేసేప్రయత్నములోవున్నారు.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ శు॥ ౧౦
గురువారము


# కొచ్చిన్‌లో బాధ్యతాయుత ప్రభుత్వ కాంక్ష

భారతదేశమందలి దేశీయసంస్థానములలో కొచ్చిన్‌సంస్థానముకూడ గణన కెక్కినదే. దానివైశాల్యము, ఆదాయము, జనసంఖ్య, విద్యావ్యాప్తి, దానిరాజ్యాంగము — ఈవిషయాలను గూర్చి యిదివరకే మేము తెలిపియుంటిమి. దానిని గమనించిన పాఠకులకు మరల వ్రాసి తెలుపవలసిన పనిలేదు.

గతసంవత్సరము కొచ్చిన్‌సంస్థానములో క్రొత్త రాజ్యాంగము ప్రవేశపెట్టబడెను. ఆరాజ్యాంగము బ్రిటిషిండియాలో ౧౯౧౯ సంవత్సరములో ప్రవేశపెట్టబడిన ద్వంద్వ ప్రభుత్వమువంటిది. అదికూడ చాలగొప్పవిషయమే.

అచ్చన బుచ్చనలోపల

అచ్చనయేచాలమేలుఅదియెట్లన్నన్ అన్నట్లుగా ౧౯౦౯నాటి మింటోమార్లీ రీఫారములవరకు వచ్చి చటుక్కున ఆగిన కొన్ని దేశీయసంస్థానాలును, అంతకు పూర్వముండిన శుద్ధనిరంకుశ పద్ధతిపై నడుచునట్టి మరికొన్నిసంస్థానాలును, కల గిటం చిల్లర సంస్థానాలలో ౧౯౧౯ నాటివరకైనా వచ్చి నిలచిన సంస్థానాలను మెచ్చుకొనకతప్పదు. బ్రిటిషిండియాకన్న యీకొచ్చిన్ ౨౨ సంవత్సరాలే వెనుకబడినదన్నమాట. అయితే యింతవరకు కొచ్చిన్‌ప్రజలు ఏమియు ఆందోళము చేయకుండా ఉన్నందున వారు దానితో తృప్తిపడినారని అనుకొంటిమి. అల్లరిలేనిదిపుల్లరిలేదు. అడుగనిది అమ్మైనాపెట్టదు తృష్ణో బ్రాహ్మణో నష్టః.

కొచ్చిన్ శాసనసభ గతవారము సమావేశమైనప్పుడు యథార్థము తెలిసింది. కొచ్చిన్‌ప్రజలకు క్రొత్తరాజ్యాంగ సంస్కరణములు తృప్తిని కలిగించలేదని స్పష్టమైనది. "మాకు బాధ్యతాయుత ప్రభుత్వము తక్షణమే కావలెను." అని వారు ఏకధాటిగా ఆక్షేపణలుచేసినారు. కొచ్చిన్ శాసనసభలో ధారిచ్చిన అభిప్రాయాలీవిధముగా ఉన్నవి.

"విద్యా వైద్యశాఖలు పబ్లిక్ పనులశాఖయు ప్రజాప్రతినిధులచే ఎన్నుకొనబడిన మంత్రులవశము చేయవలెను" అని ఒకరు, "మహారాజాగారి ఛత్రచ్ఛాయలో బాధ్యతాయుత ప్రభుత్వమును వెంటనే స్థాపించవలెను" అని ఒకరును, "కొచ్చినీలు ఇంకను బాధ్యతా ప్రభుత్వానికి తగరుఅని యెవ్వరైన అనినచో అది కొచ్చినీల అవమానపరచుట యగును" అనియొకరును "దేశీయసంస్థానాలను పైనుండి బ్రిటిషువారు అదుముచుండగా నిరంకుశులైన దివానులు (irresponsible Dewans) క్రిందనుండి దబాయించు చున్నారు" అనియొకరును ఘాటుగా ఉపన్యాసాలిచ్చిరి. అందుపై గ్రామోద్ధరణ శాఖా మంత్రిగారైన డాక్టర్ ఏ. ఆర్. మీనన్ అనువారును ప్రధానమంత్రిగారగు సర్ షణ్ముగంచెట్టిగారిచ్చిన ప్రత్యుత్తరములు చాల నిగ్రహముతో కూడినవై యుండుట ఇతరదేశీయసంస్థానప్రజల కాశ్చర్యము కలిగించకపోవు.

మీనన్‌మంత్రిగారు బాధ్యతాయుత ప్రభుత్వ మిప్పుడేకావలెనని టి. కే. నాయర్ అనువారు తెచ్చిన తీర్మానాన్ని బలపరచుచూ మాట్లాడినారు. ఇదొకవింత. అయితే బలపరచుటలో కొంత ఓపికపట్టమన్నారు. "ఒక ఆరుసంవత్సరాలు ఓపికపట్టరాదా? ఇంకాదేశములో విద్యావ్యాప్తి కావలెను. వివిధవర్గాలలో ఇంకను సౌమనస్యము వృద్ధికావలెను. మన మహారాజుగారు ఒకరుచెప్పకుండనే తమసహజమైన ఔదార్యముతోనే కొన్నిశాఖలపై తమ అధికారాన్ని వదలుకొని ప్రజాప్రతినిధుల మంత్రులవశముచేసిరికదా. దేశముయొక్క జీవితములో ఆరేండ్లకాల మెంతటిది. ఆమాత్రమువరకు దయచేసి ఓపిక పట్టండి" అని ఆయన అన్నాడు.

మీనన్ మంత్రిగారింత సుముఖముగా శాంతిపాఠముచదివినను కొచ్చిన్ సభ్యులు మెత్తబడలేదు. ఆసంస్థానశాసనసభలో నాయర్లు, ఇతరహిందువులు, క్రైస్తవులు, ముసల్మానులుకలరు. కాని వారిలో భేదాభిప్రాయము లేమియులేవు హిందువులకు "మేము అధికసంఖ్యాకులలో ఉన్నాము. మామహారాజు హిందువు మారాజ్యము హిందూసామ్రాజ్యము. మేము పాలకజాతివారము" అను రొమ్మువిరుపు మాటలు, తలవిసురు జంకెనలు, పగటి కలవరింతలు లేకుండుట ఆశ్చర్యము. క్రైస్తవులకు "మేము ముఖ్యమైన రెండవ వర్గమువారము, మేము అల్పసంఖ్యాకులమైనను మమ్ము ఒకటి రెండు మూడు అనిలెక్క పెట్టగూడదు. మమ్ముకుప్పవేసి ఒకే తూకము చేయవలెను. ఆతూకములో నూతపట్టె తక్కెడ ముల్లు ఒరగకుంటే ఒట్టు" అని నిలదీసి అడగలేదు. కొచ్చిన్ ముసల్మానుల కింకను హైద్రాబాదు ఇత్తేహాదు సందేశము అందినదోలేదో? అందినను వారికర్థము కాలేదోయేమో? ఏది యెట్లున్నను ఒక విశేషమేమనగా కొచ్చిన్ శాసనసభలోని సభ్యులందరును ఏకాభిప్రాయులై (ఒక్కరును వ్యతిరేకముగా ఛందకమియ్యక) బాధ్యతాయుత ప్రభుత్వము కావలెనను తీర్మానమును అంగీకరించిరి. ఇది చాలా ప్రశంసించవలసిన ఘట్టము. ఇది యితరసంస్థానముల ప్రజలకు గుణపాఠము నేర్పునట్టిది. "రాజు మానుతేమువాడు కావున ఇతరమతములవారు కోరితే మేము అకోరికను ఒప్పుకోము" అను ధోరణిలో కొచ్చిన్‌హిందువులు పడనందులకు వారినెంత ప్రశంసించినను లోపములేదు. ఆ సంస్థానములో అట్టి వాతావరణము కలిగించిన ప్రభువులు, మంత్రులును పూజ్యులై యున్నారు.

ఇక యీ ఏకాభిప్రాయముతో కూడిన బాధ్యతాయుత ప్రభుత్వాకాంక్షకు ప్రధానామాత్యులైన సర్ ఆర్. షణ్ముఖంగారెట్లు స్వీకరించినారో చూడుడు. వారు చీదరించుకొనలేదు. కసరుకొనలేదు. కోపముతో నిప్పుత్రొక్కినట్లు గావిగిరిపడలేదు. ప్రక్కనే ఉన్న తిరువాన్కూరుసంస్థానముయొక్క మంత్రులును, బిసెంటు శిష్యులును, హోంరూలులీగులో బహుకాలము కార్యనిర్వాహకవర్గములో ముఖ్యులును, బహుకాలమువరకు ప్రజానాయకులును నైయుండి తర్వాత వైస్రాయి కౌన్సిల్ సభ్యులై ఇప్పుడు తిరువాన్కూరు మంత్రులుగానున్న సర్. సీ. పీ. రామస్వామి అయ్యరుగారు మొన్న మొన్ననే తిరువాన్కూరుప్రజలకు మొగమోటము లేకుండా ఒక్కటేమాటతో జవాబు యిచ్చివేసిరి "మీకు బాధ్యతాయుత ప్రభుత్వము ఇయ్యము"అనివేసిరి. అన్నంతనే అయిపోదు. ప్రజలకు శక్తిగలిగిననాడు ఈబీరు ఉండనేరదు కాని సర్ షణ్ముగంగారు అట్లనలేదు. "నన్ను నమ్మండి. రాజ్యాంగములో విస్తరించు పద్ధతినే ఉంచినాము కదా. మహారాజా వారిదివరకే కొన్ని శాఖలు ప్రజాయత్తము చేసినారుకదా. ఇకమిగిలినవాటి విషయమై నన్ను విశ్వసించి నామాటవిని నాకేవదలివేయండి. శ్రీమహారాజులుంగారికి సమయము చూచి నచ్చ చెప్పేది నావంతు" ఇది మంచిపద్ధతి. కొంత ఆలస్యమగుట నిజమే: కాని ఆందోళనకు అనవసరముగా తావిచ్చుటకు మారుగా ప్రజాకాంక్షను కొంతకొంతయైనను క్రమక్రమముగాపాటించుటయె ఉత్తమ రాజనీతి. కొచ్చిన్ శాసనసభను, మంత్రులను మేము గాఢముగా అభినందించుచున్నాము.

## కిషన్‌గంజు ఆర్యసమాజపు ఎన్నికలు

హైదరాబాదుదక్కన్ జనవరి ౨౯

౧౯౪౧ జనవరి౨౬వతేదీ కిషన్‌గంజ్ ఆర్యసమాజ మందిరములో జరిగినఎన్నికలలో ఈ క్రింది కార్యవర్గమెన్నుకోబడెను:—

శ్రీపం॥ విఠల్‌ప్రసాదుగారు సైన్యప్రధాన్ శ్రీ॥గంగారెడ్డిగారు ఉపప్రధాన్, శ్రీ॥బి. రామదేవుగారు-మంత్రి, శ్రీ॥ శివరాజగారు-ఉపమంత్రి వీరేగాక మరిఆరుగురు కార్యవర్గసభ్యులుగా ఎన్నుకోబడిరి.

## మసీదుల చాటున ఖాక్సారుల తప్పులకై శిక్షలు.

పంజాబుప్రధానమగు లాహోరు నగరమందు పోయిన జూనునెలలో అనేక ఖాక్సారులను అరెస్టు చేసియుండిరికదా? వారలలో ౧౫౮ మంది మొన్న జనవరి 30వ తేదీన లాహోరులోని ఒక మేజిస్ట్రేటు ఒక్కొక్కరికి ౬ మాసాల ఖైదు మొదలుకొని ౫౭ ఏండ్లఖైదువరకు నానాప్రకారశిక్షలను విధించెను. పోయిన జూను నెలలో ఖాక్సారుల అల్లరులసమయంలో లాహోరు నగరమందలి ముఖ్యమసీదులలో అనేక ఖాక్సారులు దాగియుండి తమ అల్లరులను సాగించుచుండిరి. జూను ౧౧వ తేదీ అర్ధరాత్రి పోలీసులు ఈ మసీదుల లో వెదకి అనేక ఖాక్సారులను పట్టుకొనిరి. కొన్ని మసీదులలోని ఖాక్సారులు లొంగనందున పోలీసు లాఠీచార్జి చేయవలసి వచ్చెను. కొన్ని మసీదులలో నుండి ఖాక్సారులను బయటకు గొట్టుటకై బాష్పవాయువునుపయోగింపవలసి వచ్చెను.

## సుబేదారుగారికి విజ్ఞప్తులు

కరీంనగరము ౨౨-౪-౫౦ఫ.

శ్రీసుబేదారుగారు కరీంనగరంకువచ్చినారని తెలియగానే వివిధగ్రామాలనుండి రైతులు కరీంనగరమురాసాగిరి. ౨౦-౪-౫౦ఫ. నాడుఉదయమే వారు వెళ్ళిపోవుటచేత అతర్వాతవచ్చినరైతులు శ్రీవారితో మొరబెట్టుకుందామని ఆశతోవచ్చియుండుటవలన హతాశులై వెళ్ళిపోయిరి. కరీంనగరము తాలూకాలోని ఇంచపల్లియను గ్రామపురైతులు దాదాపు 30మంది ౨౦-౪-౫౦ఫ. నాడు శ్రీసుబేదారుగారివద్ద మొరబెట్టుకొనుటకై కరీంనగరముకువచ్చిరనియూ, వారువచ్చువరకే శ్రీవారు వెళ్ళిపోవుటచేత వారిలోనుండి ఇద్దరు వరంగల్లుకువెళ్ళి శ్రీ సుబేదారు గారివద్ద దరఖాస్తుపెట్టుకొని తమకష్టాలుచెప్పుకున్నారని తెలుస్తున్నది. దరఖాస్తులోని విషయాలిట్లున్నవని తెలుస్తున్నది:—"ఈసంవత్సరం పుసాసపంటలు పండలేదు. ఆబీ తెగుళ్లుతగిలి వాల్గడాల పంటకంటె సొక్కవపండలేదు. గత రెండుసంవత్సరాలలోను పంటలుపండకపోవుటచేత మాస్థితి చాల చెడిపోయినది. కిస్తుచెల్లించుశక్తి మాలోలేకుండపోయినది. భూములుగిర్వీబెట్టి కొందరును, ఎద్దులుమున్నగు వ్యవసాయపుపశువులను అమ్ముకొని కొందరును, నాగులకు(ధాన్యానికిధాన్యంపెచ్చు) వడ్లుతెచ్చి వాటినిఅమ్మియు ఈయేటికిస్తుచెల్లించినాము.తర్వాత బరాయిందారకముకొరకు మమ్ము బాధించసాగిరి, సిన్గరం హాల్కాగిర్దావరు మాగ్రామానికివచ్చి మమ్ముల అనేకవిధముల బాధించి నూమానముదీసిరి. ఉవఇస్పందారుసాడు గిర్దావరుగారు (౯) దిమందిరైతులను చావిడిముందట వంగబెట్టించి వీపుమీద రాళ్లు యెత్తించెను. ఇట్లువంగబెట్టబడిన రైతులపేర్లు. (౧)గ్రేపల్లి రాజరాం ౨. గ్రేపల్లివీరం 3. గ్రేపల్లి సాయెబు ౪. ముత్యాల రాజయ్య ౫ కొమ్ముల రామయ్య ౬. కొమ్ముల భూమయ్య ౭. కొమ్ముల యెల్లయ్య ౮. నాగురాజమల్లు ౯. గంపరాజా తక్కినవారినిగూడ ఆట్లేచేస్తానని చెప్పెను. మేము అప్పుడుఏమియు చేయలేనివారమై పైకము సంపాదించుకొనుటకు కొంతవ్యవధినికోరగా నాల్గురోజులవ్యవధినిచ్చెను. అవ్యవధిదాటగానేవచ్చి బరాయిందా పూర్తిగావసూలుచేసెను బరాయిందా చెల్లించుటకు పైకముసంపాదించుటకై పైన చెప్పినపద్ధతులే అవలంబించవలసి వచ్చినది. తాముకరీంనగరమువిచ్చేసి బరాయిందా వసూలు నాపివేసినారు. అది మాబీదరైతులయొక్క పెన్నిధియైనది. వసూలైనబరాయిందారకము ఇంకను పటేలుపట్వారీల వద్దనేయున్నది. దానిని మాకు వాపసు యిప్పించినయెడల చాల సహాయముకాగలదు. గిర్దావరుయొక్క పైదుశ్చర్యలనుగూర్చి విచారణచేయించగలరు

దీనిపై విచారణచేయుటకు తాలుక్దారుకు ఆజ్ఞాపించినారని తెలియుచున్నది

ఇట్లు చాలగ్రామాలనుండి, కొట్టినట్టును, వంగబెట్టినట్లును, వివిధగాలంచాలు పైవిధంగాతీసుకున్నట్లును వార్తలువస్తున్నవి.

## పాకిస్థాన్ సిద్ధాంతమును పంజాబుప్రధాని గర్హించుట

లాహోరు, ఫిబ్రవరి ౧

భారతీయులందరు ముఖ్యముగా యువకులు సాంఘిక వైషమ్యములుమాని భారతజాతి ఐక్యతకే ప్రధానముగా పాటుపడవలెననియు, అట్టి కార్యమేదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధింపజేయుననియు పంజాబుప్రధాని సర్ సికిందర్ హయాత్ ఖానుగారు వసంతోత్సవముసందర్భమున జరుపబడిన ఒకవిద్యార్థులసభలో ఉపన్యసించుచూ ఉద్బోధించిరి.

సర్ సికిందరుగారు పాకిస్థాన్, ఖాలిస్థాన్ మొదలగుపద్ధతులను గర్హించుచూ పంజాబులో పంజాబీయులప్రభుత్వముతప్ప యితరులప్రభుత్వము ఉండవీలులేదనిరి.

## నిజాంరాష్ట్ర గౌడజన సంఘము

(హైదరాబాదు దక్కను) ఫిబ్రవరి ౧

గడచిన జనాభాలో సర్కారువారి ప్రశ్నలకు సరియైన ఉత్తరములు ఇవ్వనందున మనవారి జనసంఖ్య ఎంతఅనునది సరిగా తెలియలేదు. ఎందుకన కొందరు "గౌడ" అను దానికి బదులుగ ఈడిగ, అనియు, కొందరులాగులవాపనియు వ్రాయించియున్నారు. కావున ఇప్పుడు జరుగబోవు జనాభాలో "గౌడ" అని వ్రాయించగలరని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
నిర్మల లక్ష్మారావుగౌడు
ఉపకార్యదర్శి.

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౧-౫-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము.
ధరలన్నీ హాలీలే.

| బియ్యము | | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|---|
| | | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | | ౨౫ | ౦ | ౦ |
| సంబర్లు | | ౨౩ | ౮ | ౦ |
| ఢిల్లీభోగాలు | | ౨౩ | ౦ | ౦ |
| రాంసాగర్లు | | బజారులోలేవు | | |
| సాన్నక్రాం | | ౧౪ | ౦ | ౦ క్రొత్తవి |
| | | ౨౧ | ౮ | ౦ పాతవి |
| అర్కాటి | | ౧౬ ౧౬ | ౮ | ౦ (క్రొత్తవి |
| | | ౨౦, ౨౦ | ౮ | ౦ పాతవి |
| సోనామణి | | ౧౫ నుండి ౧౭వరకు | | |
| బుడుములు | | ౧౪ | ౮ | ౦ |
| దేశావళి | | ౧౫ | ౮ | ౦ |
| గోధుమలు షర్బతి | | ౧౯ | ౮ | ౦ |
| బన్సీ | | ౧౭ | ౦ | ౦ |
| లక్డీ | | ౧౬ | ౮ | ౦ |
| పోటీయో | | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | | ౧౪ | ౪ | ౦ |
| జొన్నలు | | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | | ౧౦ | ౪ | ౧ |
| పచ్చజొన్నలు | | ౯ | ౮ | ౦ |
| మడికట్టుజొన్నలు | | ౯ | ౧౨ | ౦ |
| సెనగలు | | ౧౨ | ౪ | ౦ |
| కందులు | | రూ, ౧౦ | ౬ | ౦ |
| మినుములు | | ౯ ౧౨ ౦ మంచివి౧౦ | ౮ | ౦ |
| అలచలు | | ౧౪ | ౬ | ౦ |
| సజ్జలు | | ౯ | ౮ | ౦ |
| కుసుములు | | ౮ | ౦ | ౦ |
| పప్పు | | | | |
| సెనగపప్పు | | ౧౫ | ౮ | ౦ |
| కంది ,, | | ౧౪ | ౦ | ౦ |
| సిరిసెనగ,, | | ౧౯ | ౦ | ౦ |
| అంక ,, | | ౧౧ | ౪ | ౦ |
| మినుప ,, | | ౧౭ | ౦ | ౦ |
| పెసర ,, | | ౧౭ | ౮ | ౦ |
| బెల్లము | | ౧౦ ౦ ౦ | ౧౧ ౦ | ౦ |
| ఉప్పు | | ౧౨ | ౧౩ | ౦ |
| ఫుల్లిగడ్డ | | ౧౧ | ౧౨ | ౧౩ వరకు |
| తెల్లనరుకు | | ౧౨ నుంచి | ౨౦ వరకు | |
| చక్కెరమణుము (౪౦ సే) | | | | |
| జావా | ,, ,, | ౧౪ | ౦ | ౦ |
| బొంబాయి | ,, ,, | ౧౩ | ౧౪ | ౦ |
| మద్రాసు | ,, ,, | ౧౩ | ౧౫ | ౦ |
| నిజామాబాదు | ,, ,, | ౧౩ | ౧౨ | ౦ |
| పత్రికచక్కెర | ,, పల్ల | ౧౩, | ౧౨ ౮ | ౦ |
| దర్గాచక్కెర | ,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ | ,౧౨సే | ౫ | ౧౨ | ౦ |
| అల్లం | ,, ,, | ౧ | ౧౨ | ౦ |
| | మణుము ౧౨ సే | | | |
| కొబ్బరినూనె | | ౪ | ౮ | ౦ |
| కుసుమనూనె | ,, | ౩ | ౪ | ౦ |
| నువ్వులనూనె | ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె | ,, | ౨ | ౮ | ౦ |
| పుంటినూనె | ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్) | ,, డబ్బా ౧కి | | | |
| నెయ్యి | దిమణుము ౪౦ సే | | | |
| విదరునెయ్యి | ,, ,, | ౪౨ | ౦ | ౦ |
| తెలంగాణా | ,, ,, | ౩౯ | ౦ | ౦ |
| వనస్పతి | డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧కి | | ౫౦ | ౬ | ౦ |
| వెండి | ౧౦౦ తు | ౭౦ | ౦ | ౦ |
| | తు ౧కి | ౦ | ౧౧ | ౩ |
| పవిత్ర | ౧కి కల్దారు రూ | ౨౮ | ౮ | ౦ |
| మారకం | | | | |
| హాలీకి కల్దార్లు | | ౧౫ | ౧౩ | ౬ |
| కల్దారుకు హాలీలు | | ౧౫ | ౧౧ | ౬ |
| ఆముదాలు | బస్తా | ౧౧ | ౪ | ౦ |
| వేరుసెనగ | | ౮ | ౪ | ౦ |
| బుడ్లు | పల్లా ౧కి | ౮ | ౪ | ౦ |
| పప్పు | పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ |

గమనిక: —

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుదుము. అయినను ఏమైన పొరపాట్లుండినదానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు. ఈ. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమునుకొనుముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి మంచిప్రచారము కలుగును.

## ప్రభుత్వాజ్ఞలకు లొంగిసత్యాగ్రహవార్తలు

### సరిగా ప్రకటించనిచో

# సత్యాగ్రహమేకుడావ చేయుటయోగతి

### పత్రికలకు గాంధిమహాత్ముని సూచనలు

కొన్ని ప్రకటనల ప్రచురణవిషయమై ఇండియా ప్రభుత్వమువారవలంబించుచున్న వైఖరికి పత్రికలవారెట్లుఅసమ్మతిదెలుపవగునో గాంధిమహాత్ముడు పత్రికాసంపాదకులకు సూచించుచు, ఇట్టి ప్రకటనలను పత్రికలవారుప్రచురించి, అందువలనకలుగుకష్టములననుభవింపవలెను, లేదా ప్రభుత్వ వైఖరికి తమఅసమ్మతిదెలుపుటకుగాను పత్రికలనే ఆపివేయవలెనుఅని తెలిపినాడు.

ప్రత్యేకపత్రికాశాసనములకును, అర్డినెన్సుకును ప్రతికూలముగా శాసనోల్లంఘనముప్రారంభించు సంకల్పము లేకపోవుటచే అహింసానిర్మాణకార్యక్రమ ప్రచారమే ముఖ్యోద్దేశ్యముగా గలవైనప్పటికిని నేను మూడుహరిజన్ వారపత్రికలనుఆపివేసితిని. సాధ్యమైనంతవరకు ప్రస్తుతముజరుగుచున్న శాసనోల్లంఘనమును నేనువిస్తరించదలపను, కొనిపత్రికలు ఉద్యమమునకు సంబంధించినవార్తలను ప్రకటించువిధిగానుండదానిని విడనాడుచో శాసనోల్లంఘనము వ్యాపింపకుండచేయజాలనేమో! అని గాంధిమహాత్ముడు చెప్పుచున్నాడు,

ప్రభుత్వమువారినిషేధాజ్ఞకు పత్రికలు లొంగక సత్యాగ్రహవార్తలను సమగ్రముగా ప్రచురించి తమస్వాతంత్ర్యమును నిలుపుకొనవలెనని మహాత్ముడు కోరుచున్నాడు. ఉద్యమమును విమర్శించుటకుగాని, ఖండించుటకుగాని, ఉద్యమ సందర్భమునగావింపబడు ప్రకటనలను ఖండించుటకుగాని, పత్రికాసంపాదకులకు అధికారముకలదు.

ప్రభుత్వమువారేదేని ప్రకటనమునునిషేధించుచో, ప్రభుత్వమువారినిషేధాజ్ఞకు అసమ్మతిదెలుపుటకు రెండుమార్గములుకలవు. నిషేధింపబడిన ప్రకటనమును నాగు పత్రికలో ప్రచురించి ప్రాసిక్యూషనుకు లేక ముద్రణాలయ జప్తుకు సిద్ధముగా నుండవలెను. లేదా ప్రభుత్వమువారివైఖరికి అసమ్మతి దెలుపుటకుగాను తమపత్రికనే ఆపుచేయవలెనుఅని మహాత్ముడు చెప్పుచున్నాడు.

ఢిల్లీలోజరుగనున్న పత్రికాసంపాదకుల సలహాస్థాయిసంఘసభవిషయమై మహాత్ముడుప్రస్తావించుచు "సదరు స్థాయిసంఘసభ పత్రికాస్వాతంత్ర్యమును నిర్భయముగారక్షింపవలెను. ప్రజాభిప్రాయమును తెలుపకుండనిరోధించుచో పత్రికలకుండదగిన మహత్తరమైనశక్తి అడుగంటును" అని ఖండితముగ చెప్పినాడు.

భారతదేశమునందలి బ్రిటిషుపత్రికాసంపాదకులబాధ్యత ప్రస్తుతసమయమున చాల యెక్కువగానున్నదని మహాత్ముడు తెలిపినాడు.

అకలంకమగు అహింసాతత్వము ఈ ఉద్యమమునందు మూర్తీభవించినదనియు, ఈఅహింసాతత్వ వ్యాప్తివలన యెవ్వరికినిహానికలుగదనియు మహాత్ముడుచెప్పుచున్నాడు. తాను సామ్రాజ్యతత్వమును ప్రతిఘటించినంతమాత్రమున నాజీఫాసిస్టు తత్వాభిమానియగుట ఘోరాపవాదమని మహాత్ముడుచెప్పినాడు.

---

## విక్టోరియారాణి రూపాయల రద్దుకాలము

ఢిల్లీ, జనవరి ౩౦

౩౧-౩ ౧౯౪౧ తేదివరకు మాత్రమే విక్టోరియారాణిముద్రగల రూపాయలు చెల్లుచుండును అని ౧౧-౧౦-౪౦ తేదిని ప్రభుత్వమువారు ప్రకటనచేసిరి-కాని, ౩౦-౯-౪౧ తేదివరకు ఆరూపాయలను ప్రభుత్వపు ట్రెజరీలోను, పోస్టాఫీసులలోనుమాత్రము తీసికొనుచుండురు, ౧-౧౦-౪౧ తేదిన ఆరూపాయలు బొంబాయిలోను, కలకత్తాలోనుఉన్న రిజర్వుబ్యాంకులలో మాత్రమే తీసికొబడును. కనుకవిక్టోరియారాణి రూపాయలను వీలైనంతత్వరలోనే ప్రభుత్వమునకు వాపసుచేయవలెను.

---

# కాంగ్రెసుసత్యాగ్రహము

### ౩౦గ్రామాలుచుట్టినమీదట సత్యాగ్రహి అరెస్టు

బళ్లారిజిల్లాలోని ఆదవానిలో జనవరి ౧౦వతేదినాడు పోలీసుస్టేషనుముందర శ్రీ. కె. బలరామసింగుగారు యుద్ధవ్యతిరేక కేకలుఉచ్చరించిరి. అయినను పోలీసువారు నిర్బంధించలేదు. వారు మరల ఇంటికితిరిగిరాకుండ పల్లెలవెంబడి ప్రచారముచేయుచు దాదాపు ౩౦పల్లెలుచుట్టి కర్నూలు జిల్లాలో ౨౨వ తేదినాడు, ఎమిగనూరు ౨౩వతేది బిల్లేకల్లు, ౨౪వతేది పుటకలపూరి, ౨౫ సాయంత్రం దేవనకొండకువచ్చిరి. ౨౬వతేదినాడు ఉదయం దేవనకొండలో టౌను సబ్ఇన్స్పెక్టరు అరెస్టుచేసిరి.తర్వాత పల్లికొండలో న్న డోన్-డిప్టీకలెక్టరుగారి ఎదుట ఉదయం ౧౧గంటలకు విచారణకు నిల్పిరి. సత్యాగ్రహికి ఆరునెలలు కఠినశిక్ష,౧౦౦ రూపాయలు జుర్మానావిధించిరి. జుర్మానాచెల్లించనిచో మరియొకనెల శిక్షవిధించిరి.

### స్త్రీలసత్యాగ్రహం

తెనాలితాలూకా చేబ్రోలు వాస్తవ్యురాలు శ్రీమతివానిరెడ్డి హనుమాయమ్మగారు ౩౦-౧-౪౧వతేదిన చేబ్రోలుగ్రామంలోను, కంచెర్లపాలెంగ్రామ వాస్తవ్యురాలు శ్రీమతిమక్కపల్లి మాణిక్యమ్మగారు ౩౦-౧-౪౧వతేదిన తెనాలిపట్టణంలోను, యుద్ధప్రతికూలవాక్యములుబల్కి సత్యాగ్రహముగావించిరి తెనాలిడిప్యూటికలెక్టరు విచారించి వీరికిద్దరికిని ఒక్కొక్కరికి ౩నూ నెలలకఠినశిక్ష విధించిరి.

### సత్యాగ్రహికి రెండణాలుజుర్మానా

జనవరి౩౦వతేది మధ్యాహ్నము గూడూరుజాయంటు మేజిస్ట్రేటుఅగు గలెటీగారు పొన్నలూరు వీరరాఘవరెడ్డిగారిని విచారించి ౩నెలల కఠినశిక్ష రూ. ౫౦౦జుర్మానావిధించిరి. కనుపర్తి నారాయణరావుగారినివిచారించి విచారణలో ఎన్నోప్రశ్నలనువేసినమీదట ౩నెలలకఠినశిక్షను,రూ.౧౦౦జుర్మానాను వేసిరి, వెంకటగిరి టవునుసత్యాగ్రహి మహమ్మద్‌చాబూసాబుగారిని విచారించి వారికి కోర్టులేచేమంతవరకు శిక్షను, రెండణాలుజుర్మానాను విధించిరి, సాహెబుగారు కట్టజుర్మానా నన్నంమున గలెటీదొరగారే కట్టుకొనిరి.

సూళ్లూరుపేట తాలూకా సత్యాగ్రహియైన యం పి రాజగుప్తాగారిని విచారించి వారికి కోర్టులేచేంతవరకు శిక్షయును, రూ ౫౦౦జుర్మానాయును విధించిరి. అప్పకొముల విశ్వనాథంగారిని మర్నాడువిచారించెదమనిరి,

సత్యాగ్రహ మొనర్చిన కె. వెంకటగమణారెడ్డి, మడుసు వెంకటస్వామినాయుడుగార్లను పీనలుకోడు ౧౫౩వసెక్షనుక్రింద విడుదలచేసిరి. పీనలుకోడునందలి ౧౫౩వసెక్షను ఈక్రిందివిధముగనున్నది కేవలముఅత్యల్పమైన నష్టముకలుగజేయునట్టివియు, సామాన్యులు ఆక్షేపింపని అల్పనష్టము కలుగజేయునట్టియు చర్యలు నేరములు కాజాలవు.

### అరెస్టుకాని ఆంధ్రసత్యాగ్రహి

శ్రీ రుమురా లక్ష్మిశివయ్యగారు హిందీప్రచారకులు చెన్నూరు)౩౦వతేది ఉదయము మంగళపూరు గ్రామములో సత్యాగ్రహముచేసిరి కానివారిని అరెస్టుచేయనందున శివయ్యగారు అక్కడినుండి గ్రామగ్రామములలో సత్యాగ్రహముచేయుచు ఉపన్యాసములొసంగుచు ౩౦వతేది సాయంకాలమునకు గూడూరుచేరుకొని రైలురోడ్డువద్దను,గాంధిచౌకుమీదను ఉపన్యసించిరి,

### నందిగామతాలూకా కాంగ్రెసుసంఘాధ్యక్షుని అరెస్టు

నందిగామతాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు శ్రీయుత అనుముల రామగోవిందశర్మగారు జగ్గయ్యపేటలో ౩౦-౧-౪౧ తేదినసత్యాగ్రహముచేసిరి, పోలీసువారు అరస్టుచేసి తిరువూరుతాలూకాలో క్యాంపుజేస్తూన్న బెజవాడ సబ్కలెక్టరుగారివద్దకు కేసువిచారణకై తీసుకొనివెళ్ళిరి.

### సత్తెనపల్లితాలూకా మొదటిసత్యాగ్రహి

సత్తెనపల్లితాలూకా మాదలగ్రామంలో జనవరి౩౦వతేది శ్రీ రుమువావిలాల మాణిక్యాంబగారు సత్యాగ్రహముచేసి అరెస్టుఅయిరి, ఈతాలూకాలో యీమెగారు ప్రథమసత్యాగ్రహి. గుంటూరు డిప్యూటీమేజస్ట్రేటు ఆమెకు ౩నెలలు కఠినశిక్షవిధించిరి.

### అరెస్టుకానందున ఢిల్లీయాత్ర

మధ్యరాష్ట్రములో నగసింగపూరు పురిపాలకసంఘాధ్యక్షుడగు శ్రీ. బి. ప. పచారీగారు జనవరి ౩౧వ తేదిన సత్యాగ్రహముచేసిరి. కాని అరెస్టుచేయలేదు. ఆయన ఢిల్లీకి ప్రయాణమయెను మార్గములో సత్యాగ్రహములు చేయుదురు. పచారీగారు యీమధ్యనే తమ 'రాయెసాహెబు' బిరుదమును విసర్జించిరి.

### ధనికబ్యాంకరు సత్యాగ్రహము

మధ్యరాష్ట్రములోని యోత్మలులో ఒక ధనికబ్యాంకరు, మునిసిపాలిటీ అధ్యక్షుడునగు శ్రీ సేత్ తారాచంద సురానాగారు సత్యాగ్రహం చేయగా జనవరి ౩౦వ తేది అరెస్టుచేయబడిరి.

---

## హైదరాబాదు రాజకీయసంస్కరణలు

### హిందూనాయకులతో అధికారుల సంప్రదింపులు విఫలమగుట

హైదరాబాదు, జనవరి౨౯.

(నిజాంప్రభుత్వమువారు హిందూనాయకులతో సంభాషణలు ప్రారంభించుటవల్ల తమకువారికిని జరుగుచున్న సంప్రదింపులు ఆగిపోయినవని నవాబుబహదూర్ యార్జంగుగారు ఒకసభలో ప్రకటించిరి. ప్రభుత్వమువారు శ్రీ మందుముల నరసింగరావుగారిని (రయ్యత్ పత్రికాధిపతులు) కాశీనాథరావు వైద్యాగారిని(హైద్రాబాదుస్టేటు కాంగ్రెసుతో సంబంధముండినవారు]రామాచారిగారిని పిలిపించి రాజ్యాంగసంస్కరణల విషయమై నాయకులఅభిప్రాయముల తెలుసుకొనినట్లు విచారణవల్ల తెలియుచున్నది. అందులోఒకరు సంయుక్తనియోజక వర్గములుండవలెననియు, అల్పసంఖ్యాకులకు ప్రత్యేకస్థానము లుండవచ్చుననియు, వృత్తులద్వారా శాసనసభలలో ప్రాతినిధ్యంపోయి జిల్లాలవారిగా ప్రాతినిధ్యముండునట్లు చేయవలెననియు, చెప్పినట్లు తేలుచున్నది.)

ఆంధ్రపత్రిక

---

## పంజాబులో ఉర్దూ నిర్బంధంలేదు

### గవర్నరు కార్యదర్శి తెలుపుట

పంజాబు ప్రాథమిక విద్యావిధాన శాసనము ను పంజాబు అసెంబ్లీసభవారు ఆమోదించియుండిరి. ప్రాథమికవిద్యను ఉర్దూభాషలో నేర్పవలెనని అచట్టములో నిబంధించినట్లు గానే పంజాబీభాషలోను, హిందీభాషలోనుకూడ విద్యనేర్పునట్లుగా నిబంధింపవలెననికోరుచు లాలా దేశరాజుగారు పంజాబు గవర్నరుకు ఒకవిజ్ఞప్తి పంపిరి.

ఆశాసనమును గవర్నరుగారు పరిశీలించిరనియు, ఉర్దూభాషను నిర్బంధముగా నేర్పవలెనని అందులోలేదనియు గవర్నరుగారి కార్యదర్శి జవాబు వ్రాసెను.

---

### జిల్లాకాంగ్రెసు అధ్యక్షునికి శిక్ష

పంజాబురాష్ట్రంలో రోహతక్ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు శ్రీ బాబూఆనందస్వరూప్ గారికి 1 సం॥ కఠినశిక్ష విధింపబడెను. హాజీ శైమర్ మహమ్మదుగారికి 9 నెలలు కఠినశిక్ష, రూ 50 జుర్మానావిధింపబడెను. కర్నాలజిల్లాకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ చౌదరీ మాన్సింగుగారికి 9 నెలల కఠినశిక్ష విధింపబడెను

### భార్య సత్యాగ్రహము...

### ప్రాసిక్యూషను తరఫున భర్తసాక్ష్యము

జనవరి ౨౯వతేదిన లాహోరులో సత్యాగ్రహంచేసినందుకు అరెస్టుచేయబడిన శ్రీమతివిద్యాకుమారిగారికి స్థానిక మేజిస్ట్రేటు మరునాడు కోర్టుముగిసేవరకుశిక్ష, రూ ౫౦ జుర్మానా, దానిని చెల్లించనియెడల మరొకనెల శిక్షవిధించెను. ఆమెజుర్మానా చెల్లించుటకు నిరాకరించి జెయిలునకువెళ్లుచునెను. ఈకేసువిచారణలో నొకవిశేషమేమనగా సత్యాగ్రహిభర్తయే ప్రాసిక్యూషను తరఫున సాక్షిగాహాజరయ్యెను. సత్యాగ్రహం చేయునట్లు ఆమెఉద్దేశ్యముదెలుపునోటీసును ఆతడు జిల్లామేజిస్ట్రేటుకు అందజేసినట్లుచెప్పెను.

౮ వ పేజి చూడుడు

## హైదరాబాదు మెడికల్ కౌన్సిలుస్థాపనోత్సవము

### సభనుండి ఖాన్గీవైద్యుల నిష్క్రమణము

హైదరాబాదు (దక్కన్), జనవరి ౨౮

నేటిసాయంకాలము హైదరాబాదు మెడికల్ కౌన్సిలు స్థాపనోత్సవము మ-ఘ-వ. నిజాం ప్రభుత్వవైద్యశాఖాఅధ్యక్షుని కార్యాలయమందు ప్రధానమంత్రి రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరీగారిచే జరుపబడినది. వైద్యశాఖాధ్యక్షుడగు డాక్టర్ హైదరలీఖాన్ గారు సర్ అక్బర్ హైదరీగారిని స్థాపనోత్సవముజరుపవలెనని కోరుటకై ఇచ్చినఉపన్యాసంలో "హైదరాబాదు వైద్యులరిజిష్ట్రేషనుశాసనము ౧ (౧౩౪౯ ఫ)" నిజాంరాష్ట్రంలో అలోపతివైద్యము చేసేవారల పేర్లను రిజిష్టరుచేయవలసిన అవసరమునబడుట వల్ల చేయబడినదనిచెప్పిరి. ఈవిధంగా రిజిష్టరు చేసికొనని వైద్యుడెవడుగాని ఇకమీదటతానుఇచ్చిన వైద్యసలహాకైగాని, శస్త్రచికిత్స సంబంధమైనసలహాకైనగాని. రోగినికనిపెట్టి యున్నందుకైగాని, లేక ఎట్టిఆపరేషనుగాని చేసినందుకైగాని రావలసినఫీజుకొరకై న్యాయస్థానంలో దావాచేయుటకుహక్కు-ఉండజాలదు: మరియుప్రభుత్వోద్యోగముగాని ప్రభుత్వసహాయంపొందే ఏసంస్థలోనైనా ఉద్యోగంగాని చేయరాదు.

సర్ అక్బర్ హైదరీగారు ఉపన్యసించుచు హైదరాబాదు మెడికల్ కౌన్సిల్ స్థాపన నిజాంరాష్ట్రవైద్యచరిత్రలో గొప్పఘట్టమనియు, ఈ సంఘము ఈరాష్ట్రంలో అలోపతివైద్యముచేసేవారు సరిగాచేసేటట్లు కనిపెట్టుచుండుటయేగాక ఈరాష్ట్రంలోని వైద్యబిరుదములను ఇతరప్రాంతాలవైద్యపరీక్ష సంస్థలామోదించుచో అట్లుఆమోదించినసంస్థలిచ్చెడి బిరుదాలను తామునుఆమోదించుటకుగాను ఇతరప్రాంతాలలోని మెడికల్ కౌన్సిళ్ళతో సంబంధముగలిగియుండుననియు చెప్పిరి. హైదరాబాదు సంస్థానమందు అలోపతి

## బీదరు నిందితులకు సెషన్ శిక్షలు

హైదరాబాదు (దక్కన్), జనవరి ౩౧

బీదరులోజరిగిన గంజాదహనసేరముపై ౩౮గురు మహమ్మదీయులను పోలీసువారుఅరెస్టుచేసి బీదరు న్యాయస్థానమందు ప్రవేశపెట్టిరి, న్యాయాధికారిగారు వారిలో ౯ మందిని నేరముఋజువుకానందున విడుదలచేసిరి. తక్కిన ౨౯ గురికి ౨-౭ సంవత్సరములవరకును వేరువేరుగా శిక్షలవిధించిరి. అందుపైనిందితులు గుల్బర్గా సెషన్ న్యాయస్థానమందు మురాఫాచేసిరి. సెషన్ న్యాయాధికారిగారు నేరమునువిచారించి మురాఫాను త్రోసివేసిరి. నిందితులు హైకోర్టులో తిరిగి మురాఫాచేసెదరని తెలియవచ్చినది.

వైద్యముచేయువారు ఎంతఉత్తమపద్ధతిపైతమ విధులనునెరవేర్చుచుందురో అంతపలుకుబడి వారలకు సైన్టిస్టులలోనుండగలదు కాబట్టివాస్తవరిస్థితులపరిజ్ఞానమునకుతోడుగా ఉన్నతాదర్శమున్నవాడు వైద్యులైసేవనికి ప్రజలుప్రశంసింతురు-దానివల్లరాష్ట్రమునకుకూడ ఖ్యాతిరాగలదు--అని సర్ అక్బర్ గారు చెప్పిరి తమకార్యాలయంలో పనిచేసేఉద్యోగులు చాలినంతలేరని మెడికల్ కౌన్సిల్ వారుచెప్పినదానివిషయమై ప్రభుత్వము వారు శ్రద్ధగావిచారించగలరని హైదరీగారు వాగ్దానముచేసిరి.

### ఆగ్రహంతో సభనుండి ఖాన్గీవైద్యుల నిష్క్రమణం

హైదరీగారి ఉపన్యాసానంతరము ఖాన్గీవైద్యముచేసేవారిపక్షాన సభకువచ్చియుండిన డాక్టరు లతీఫ్ సయ్యదుగారు ఖాన్గీవైద్యుల అభిప్రాయంకనుగొనకుండా మెడికల్ కౌన్సిల్ ఏర్పరచినందుకు తీవ్రముగా ఆక్షేపణవెల్లడించి, ఆగ్రహసూచకముగా సభలోనుండిన ఖాన్గీవైద్యులనందరిని వెంటబెట్టుకొని లేచివచ్చిరి.

## యస్. యన్. రెడ్డిగారు

హైదరాబాదు(దక్కన్) ఫిబ్రవరి ౩

యస్.యన్. రెడ్డిగారిప్పుడు జిల్లా పోలీసు మొహతమీంపదవినుండి మార్చబడినారు. రోడ్డు ప్రయాణాల మోటార్లనిగరాని, మోటార్లరిజిష్టరీ మున్నగుపనులను చేయుశాఖలోనికి వారినిమార్చినారు. ఆపని వారికి తెలియదు. వారిదివరలో తర్ఫీతుపొందినది పోలీసుశాఖకుగాను అందులో జగత్ప్రసిద్ధినొందిన స్కాట్లెండుయార్డులో తర్ఫీయతుపొంది ప్రఖ్యాతివహించినవారు కానియిప్పుడీ క్రొత్తఉద్యోగానికి మరల తర్ఫీతుపొందవలెను. అందుచేత వారిని మద్రాసుకుపంపినారు,

## రయ్యత్ దినపత్రిక

హైదరాబాదు(దక్కన్), ఫిబ్రవరి ౩

రయ్యత్ ఉర్దూదినపత్రిక మందుముల నరసింగరావుగారి సంపాదకత్వములో ఏప్రెల్ మొదటి తేదీనుండి ప్రారంభమగునని అనుకొనబడుచున్నది. ఆపత్రికనులిమిటెడుకంపెనీగా చేయుచున్నారనియు దానిసంబంధమైన కార్యకలాపముపూర్తి అగుచున్నదనియు వినబడుచున్నది.

### గొల్లకిటికి ఆంధ్రబాలికా పాఠశాల

హైదరాబాదు (దక్కన్), ఇస్ఫదారు శ్రీయుత పుప్పాల బుగ్గయ్యగారు (నగలవర్తకులు) ఈ పాఠశాల విద్యార్థినియగు తమపుత్రి కౌరత్నము వివాహసందర్భములో పాఠశాలబాలికలకువిందును, పాఠశాలకు (౧౧)పదునొకండు రూపాయిలు వివాహకట్నమునొసంగిరి. కాబట్టి వీరివిద్యాభిమానము ప్రశంసనీయము.

జి. మాధవయ్య,
గౌరవకార్యదర్శి పాఠశాల.

### హైద్రాబాదు యుద్ధసహాయం

హైదరాబాదు (దక్కన్). ఫిబ్రవరి ౩

లండన్ మేయరునిధికిగాను ౧౦౦౦౦ పౌండ్లున్ను ౫౦౦౦పౌండ్లు నౌకాసంఘమునకు పంపియున్నారు. ఇదివరలో ౫౦,౦౦౦ పౌండ్లు స్పిట్ఫైర్ కున్ను ౧౦౦౦౦పౌండ్లు గ్రీసుదేశానికిన్ని హైద్రాబాదు యుద్ధనిధినుండి పంపియుండిరి. అప్పటినుండి కృతజ్ఞతా వందనాలు వచ్చియున్నవి.

## హైద్రాబాదు స్త్రీల సాంఘికాభివృద్ధి సంఘము

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి౩

పైసంఘమువారుశనివారము ౨౫జనవరినాడు హైద్రాబాదునగరములోని బషీర్బాగ్ రోడ్డులో నిక్లబ్బులో సమావేశమై యీక్రింది తీర్మానాలు చేసిరి,

వివిధమతములవారిలో పరస్పరసానుభూతికలిగించుటకై దేవనాగరి, ఉర్దూలిపులఉభయవర్గములవారును నేర్చుకొనవలెననియు, ఉభయభాషలలో సాహిత్యములోని ఉత్తమతత్త్వమును తెలుసుకొనవలెననియు ఈసభవారు నిర్ణయించుచున్నారు.

హైద్రాబాదు శాసనసభవారు బాల్యవివాహనిషేధశాసనమును ఎత్తివేయుటనువిని ఈసంఘమువారు నిర్ఘాంతపోయినారు. శాసనసభవారిచర్య గర్హ్యమైనది స్త్రీలకే ఎక్కువగా సంబంధించినయీసమస్యపై అన్ని తెగలస్త్రీలును అన్నిసభలలోను ఏకాభిప్రాయులై యీ శాసనము కావించవలసినదని కోరినప్పటికిని యీశాసనసభవారు తెలిసీయు యీఅభిప్రాయాలను నిర్లక్ష్యము చేసినారు. ఈఅమానుషమైన బాల్యవివాహ దురాచారము దేశాభ్యుదయానికి అడ్డంకుగాఉన్నది. ఈచర్చను శాసనసభవారు మరలచర్చించి శాసనము కావింపవలసియుండును.

## గడియారంబాగాలేదు గండంతప్పలేదు

సికింద్రాబాదు ఫిబ్రవరి ౩

సికింద్రాబాదు పాతజైలువీధివద్ద షేక్ ఫరీదు అనేవానిగడియారము దుకాణమున్నది. అచ్చట ముచ్చటపడి హాజీబిన్ మహమ్మదు అనే అరబ్బువాడు ఒకగడియారాన్నికొన్నాడు. దానివెల రెండురూపాయిలుమాత్రమే. ఈ రెండురూపాయిలగడియారము మూడుదివాలుబాగా పనిచేసింది. నాల్గవదినము తిరగబడింది. సరిగాపనిచేయకపోయింది. అరబ్బుకు గడియారముమీద గడియారంఅమ్మినవానిమీద, గడియారందుకాణంమీద పట్టరానికోపంవచ్చింది. గతఆదివారంనాడు అరబ్బువాడుపైదుకాణానికిపోయి"ఏయ్ నీగడియారంతీసుకో నా ౨ రూపాయిలుయిట్లాపడవేయ్యి"అనిగర్జించినాడు. అందుపైవారుపైకమియ్యమన్నారు.దుకాణంయజమాని నౌకరు ఛోటాసాబుఅనువాడున్ను అరబ్బున్ను కొంతసేపుతగవులాడుకున్నారు, ఇంతలోయజమానిషేకుఫరీదువచ్చినాడు అతడున్నూ పైకంఇయ్యమన్నాడట. అరబ్బు కోపం ఆపుకోలేకపోయినాడు. నడుమునున్న జంబియాతీటాలువలాగినాడు. పటీలుమని ఫరీదుకడుపులోపొడిచినాడు. అడ్డమువచ్చిన ఛోటాసాబునౌకరునుకూడ అదేకత్తితో శాస్తిచేసినాడు, షేకుఫరీదు పరమపదించినాడు ఛోటాకు గాయంతగిలింది. అరబ్బుఅరెస్టుఅయినాడు. పోలీసువారలు విచారణలు చేసుకుంటున్నారు.

# బాధ్యతాయుత ప్రభుత్వమే కొచ్చినువారి ఆదర్శము

## దానిసంపూర్ణ ప్రాప్తికి ముందు మార్గములు

కొచ్చినుదివానుగారి వివరణము

కొచ్చినుసంస్థానపు లెజిస్లేటివుకౌన్సిలు [శాసనసభ] జనవరి ౨౨ వ తేదిమధ్యాహ్నము డిప్యూటీప్రెసిడెంటు అగు కె-అయ్యప్పన్ గారి అధ్యక్షతనసమావేశమైనపుడు బాధ్యతాయుత ప్రభుత్వమునుగూర్చి దివాను షణ్ముఖంశెట్టిగారొక ప్రకటనచేయవలసివచ్చెను. పరిపాలనలోవిద్యాశాఖ, వైద్యశాఖ నిర్మాణశాఖ, ప్రజాప్రతినిధులగు మంత్రులఅధికారమునకు అప్పగించబడవలెననుతీర్మానమును టి- కె- నాయరు గారును. వెంటనే ఘనతవహించిన కొచ్చినుమహారాజాగారి ఛత్రచ్ఛాయక్రింద సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వపద్ధతి నేర్పాటుచేయవలెనను తీర్మానమును టి- వి- సుబ్రహ్మణ్యయ్యరు గారును ప్రతిపాదించిరి.

గ్రామోద్ధరణశాఖమంత్రియగు డాక్టర్ ఏ- ఆర్. మెనాన్ గారు టి.కె. నాయర్ గారితీర్మానమును బలపరచుచు బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతి సంపూర్ణముగ సిద్ధించుటకుముందు జనులుఇప్పటికంటెఎక్కువ విద్యావంతులుగ నుండుటయు. వోటుయొక్క ప్రయోజనమును సామాన్యజనులుకూడ ఇప్పటికంటెచక్కగా తెలిసికొని తెలిసికొనినదానికనుగుణముగా ఆచరణచేయుటయు, పరస్పర సహనమును, పనిజేయుగలశక్తియు, ఒకతెగవారొక తెగవారినిద్వేషించకుండుటయుచాలముఖ్యావసరములనిచెప్పిరి. కొచ్చినులో ఈగుణములుయింకను పూర్తిగాసిద్ధించలేదు, సిద్ధించినవని ఒప్పుకొన్నను తొందరపడక మార్పులుచేయుటమంచిది. ఆరేండ్లువేచియుండుటయన ఏదేశమునకుగాని ఒకదీర్ఘకాలముగాదనిరి. శాసనసభవారందరును ఒక్కమాటగా దేనినిగాని అడుగుటమంచిదనియు,ఇపుడుప్రజాప్రతినిధియగుమంత్రికప్పగించియున్న పరిపాలనశాఖలపై అధికారమును మహారాజాగారు వదలుకొనియున్నారనియు, ఇప్పటిదివానుగారుకూడ బాధ్యతాయుత ప్రభుత్వమునందు మంచిఅభిమానియనియు మెనాన్ గారుచెప్పిరి. కె.ఆర్. విశ్వంభరన్ గారు పూర్తిబాధ్యతాయుత ప్రభుత్వమువెంటనే కావలెనను తీర్మానమునుబలపరచుచు కొచ్చినుప్రజలు పూర్తిబాధ్యతాయుత ప్రభుత్వమనుభవించుటకింకను అర్హులుకారనుట కొచ్చినుప్రజల తెలివితేటలను. రాజకీయావబోధమును తిరస్కారము చేయుటయేననిచెప్పిరి. అందువల్ల తనకుపూర్వము ఉపన్యసించినగ్రామోద్ధరణశాఖమంత్రి అభివృద్ధిప్రతికూలుడని చెప్పవలసియున్నదనిరి. ఇప్పటి ఇద్దరిపెత్తనపుపద్ధతి (డయార్కీ)వల్ల ప్రజాప్రతినిధియైనమంత్రి ప్రజలకప్పగించని ప్రభుత్వశాఖలపై అధికారముగలవర్గముయొక్క దయాదాక్షిణ్యములను అనువర్తించుచుండవలసిన వాడగుచున్నాడనియు, ఈవిధంగా బాధ్యతాయుత ప్రభుత్వమును కొద్దికొద్దిగాఇచ్చుచుండ ఓర్పుకొనియుండజాలమనియు విశ్వంభరన్ గారనిరి.

ప్రభుత్వకార్యదర్శియగు కె. అచ్యుతమెనాన్ గారు ప్రభుత్వపక్షమున సమాధానమిచ్చుచు ఈవిషయములు ఇదివరకుఅనేకసారులు ఈసభలో చర్చనువచ్చినపుడు ప్రభుత్వపక్షమునఇవ్వబడియున్న సమాధానములకంటె ఇపుడుతానెక్కువచెప్పవలసినదేదియులేదనియు, వెంటనేఈవిషయంలో ఏదిగానిప్రకటించవలసిన అవసరములేదనియుచెప్పిరి.

### ప్రశ్నలు

జనవరి ౨౯ వ తేదిపగలు ౧౧ గంటలకు మరలకొచ్చిను శాసనసభసమావేశమైనపుడు దివాను షణ్ముఖంశెట్టిగారు అధ్యక్షతవహించిరి. మరల బాధ్యతాయుత ప్రభుత్వమునుగురించి చర్చజరిగెను. ఇక్కండవరియర్ గారు పూర్వదినసమున ప్రభుత్వకార్యదర్శి ఇచ్చినసమాధానములో ఏమీకనిపించుటలేదని ఆక్షేపించగా దివానుగారు ప్రభుత్వము టి-కె-నాయర్ గారి తీర్మానమును ప్రతిఘటించుటలేదనియు, కొచ్చినురాజ్యాంగశాసనములో ఆతీర్మానమునకు అనుకూలముగ వ్యవస్థచేయబడెననియు ప్రభుత్వకార్యదర్శి చెప్పినమాటకర్థమనిరి. అందుకుఇక్కండ వరియర్ గారు కొచ్చినుప్రజలవిద్య అభివృద్ధిజెందినదనియు, కొచ్చినుప్రభుత్వోద్యోగాలలో అందరును కొచ్చినీయులేఉన్నారనియు కాబట్టి కొచ్చినుప్రజలకు సంపూర్ణముగా పరిపాలనభారమంతయు వశపరచవచ్చుననియు, దానినిభరించి నిర్వహించుటకు కొచ్చినుప్రజలు సంసిద్ధులైయున్నారనియు, కోశాధికారమిచ్చినగాని నిజముగాఅధికారమిచ్చినట్లుకాదనియు సమాధానమిచ్చిరి. టి కె. నాయరుగారితీర్మానంలో కోశాధికారముకావలెననిలేదుకదాయని దివానుగారడిగిరి. అందుకు వరియర్ గారు ఒకచోటనిలచియుండక క్రమక్రమంగా బాధ్యతాయుతప్రభుత్వమును సంపూర్ణముగ సిద్ధింపజేసెదమని ప్రభుత్వమువారు మాటనీయవలెననియే తమకోరికయనిరి. అబ్రహాంబి; సేలంగారు టి. కె. నాయర్ గారి తీర్మానము ను బలపరచుచు సంస్థానాలకు పైనుండి బ్రిటిషుపాలకులఒత్తిడియు, క్రిందినుండి ప్రజలకుబాధ్యులుకాని దివానులఒత్తిడియుగలదనిచెప్పిరి. అధికారములన్నియు ప్రజలవశమై యుండవలెననియు శాసనసభకు చాటునశాసనమును అమలుచేయుదగినదానిని నిర్ణయించు అధికారముకూడా సంస్థానాధీశులకుండుటమంచిదికాదనిరి. కొచ్చినుప్రజలు బాధ్యతాయుతప్రభుత్వప్రాప్తికి మరొకమెట్టు సెక్కుటకిపుడర్హులై యున్నారనుచు సేలంగారు కొచ్చినులో శాసనప్రకారము ప్రభుత్వపాలన జరుగుచున్నదనిరి.

జనవరి ౩౦వ తేదినాడుకూడ తీర్మానములపైచర్చజరిగినది. మొత్తముమీద ౩౧ మంది ప్రభుత్వాధికారేతరసభ్యులు టి. కె. నాయర్ గారి తీర్మానమును బలపరచిరి. దివానుగారు చర్చలకు సమాధానమిచ్చుచు మెట్టుమెట్టుగా బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రాప్తింపజేయగలమని చెప్పినమాటకుతానుబద్ధుడైయున్నాడనియు,తనమాటను మార్చుకొనుటలేదనియుచెప్పిరి. ఎట్టిమార్పుచేయతలపెట్టినను, సులువుగాసాధ్యమగునట్లుగా కొచ్చినురాజ్యాంగశాసనము రచితమైయున్నది. దానిననుసరించి మొదటిమెట్టుగా గ్రామజనులకు ఎక్కువఉపయోగకరములైన పరిపాలనాంశముల అధికారము ప్రజాప్రతినిధులకే మహారాజాగారు సంక్రమింపజేసినారు మరొకమెట్టు నెప్పుడెక్కించవలసినది మహారాజాగారికి సలహానిచ్చుభారమును తనపైనుంచుటకు సభలోనందరును అంగీకరింతురని తనతలంపు —అనిదివానుగారుచెప్పిరి.

తుదకువోట్లుగైకొనగా, టి. కె. నాయర్ గారి తీర్మానముప్రతికూలతలేకుండ ఆమోదించబడెను.

— —

# శ్రీశైల వీరశైవ మహాసభ.

ఇదే విక్రమమాఘ ౧౭ ౧౩.౧౪.౧౫ (ఫిబ్రవరి 23 24.25) లో శ్రీశైలమున నీ మహాసభ జరుగును. శ్రీశైలజగద్గురువులు ఉజ్జయనీజగద్గురువుల వారును ఆగమింతురు. చాలముఖ్యమైన విషయములను గూర్చిన తీర్మానములు ఉపన్యాసములు జరుగును. ప్రేక్షకులు సభ్యులు మున్నగువారికి వేరువేరు ప్రవేశ పత్రికలుకలవు. వీరశైవ మహాజనులందరు పాల్గొనకోరుచున్నాము

ఏజంటు.

శ్రీశైలమఠము —గుంటకల్లు.

— —

# విషమ రాజకీయ స్థితి తొలగించు యత్నము

ఇండియా ప్రభుత్వముతో ఆలోచనలు.

ఇండియాదేశమందలి కొందరు ప్రసిద్ధపురుషులు ఇప్పటి విషమరాజకీయస్థితిని తొలగించివేయుటకై మార్గములనుగూర్చి ఇండియా ప్రభుత్వమువారితో నాలోచించుచున్నారు. కొన్నిరోజులతర్వాత ఆ ఆలోచనలనుండి తేలినసూచనలు బయటపడగలవని 'హిందూ' పత్రికకు దాని లక్నో విలేఖరుడు జనవరి ౩౦వ తేదీనాడు పంపినవార్తలో తెలిపినాడు.

— —

# కాంగ్రెసుసత్యాగ్రహము

౫ వ పేజీ తరువాయి

## జనాబు పీరూసాహెబుగారికి శిక్ష

పెనుకొండ, జనవరి ౨౮

బ్రిటిషు ఆంధ్రరాష్ట్రంలో హిందూపురం తాలూకా మాదేపల్లి పీరూసాహెబుగారు జనవరి ౨౭వతేది ఆదేతాలూకా గోపిన్‌దేవరపల్లి గ్రామమున యుద్ధవ్యతిరేక కేకలువేసి సత్యాగ్రహముచేయగా వెంటనేహిందూపురం పోలీసువారు అరెస్టుచేసిరి. పగలు ౧౨ గంటలకు పెనుగొండ జాయింటు మేజస్ట్రేటు పీరూసాహెబుగారికి 3 నెలల కఠినశైదు విధించిరి. ఈసాహెబు ఈడివిజన్ ప్రథమమహమ్మదీయ సత్యాగ్రహి.

## పూర్వపు అడిషనలు పబ్లికు ప్రాసిక్యూటరు సత్యాగ్రహము

ఇదివరలో గుంటూరులో అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటరుపనిచేసి రాజీనామానిచ్చిన శ్రీ కాకాని వెంకట సుందరరావుగారు జనవరి౨౫ తేది గుంటూరులో జిల్లాకోర్టుభవనమున కెదురుగ యుద్ధప్రతికూలకేకలనువేసి సత్యాగ్రహమొనర్చిరి. గుంటూరు సబ్‌డివిజనల్ మేజస్ట్రేటుగారు తాలూకాకోర్టుహాలులో విచారణసలిపి, ౪ నెలల కఠినశిక్షయు, రూ. ౨౦౦ జుర్మానాయు విధించిరి. జుర్మానాచెల్లించనిచో ౨ నెలల కఠిన శైదు అనుభవించవలసి యుండుననిరి.

## మేజస్ట్రేటు సత్యాగ్రహి ప్రాముఖ్యము విచారించుట

ఆంధ్రరాష్ట్రములో కుప్పమునకుసమీపమునగల పెద్దశెట్టిపల్లిఅను గ్రామములో ఆగ్రామవాస్తవ్యులు తోటిమునెయ్యగారు (హరిజనుడు) ౨౭వ తేది సత్యాగ్రహముచేసిరి. చిత్తూరుసబుడివిజనలు మేజస్ట్రేటు తోటిమునెయ్యను విడుదలచేస్తే వెళ్లిపోతారాఅనిఅడిగితే గాంధిమహాత్ముని ఆజ్ఞ మేఱకు ప్రచారంచేస్తానుఅనెను. నీకుఎన్నాళ్లు శిక్ష చెప్పుదునని అడుగగా, మునెయ్య మీకిష్టమున్నన్నాళ్లు జైలులోపెట్టండిఅనెను. పోలీసు సబిన్‌స్పెక్టరును నీడు అముఖ్యుడు గాకనబడును, సత్యాగ్రహమప్పుడు ఎందరుండినారు? అని అడుగగా సుమారు3౦౦రైతులు చుట్టుప్రక్కల గ్రామాదులనుండివచ్చియుండిరని సమాధానమువచ్చెను. గ్రామాలలో ఇంతఉత్సాహమున్నదాఅని న్యాయాధిగారిఅడిగినదానికి ఇన్స్పెక్టరు కుప్పంలోఎక్కడ చూచినను యీమేఱకు ఉత్సాహముగానేవున్నదనిరి. పిమ్మట మునెయ్యను ౧-౨-౪౧ తేదివరకు చిత్తూరుసబ్ జైలులో రిమాండులోవుండులాగున ఉత్తరువుచేయబడినది.

## హిందూముసల్మానులయెదుట సత్యాగ్రహము

అనంతపురం జిల్లా కాంగ్రెసు సంఘసభ్యుడుగనుండిన కె. రాధాకృష్ణయ్య శెట్టిఅను యువకుడు ౨౮-౧-౪౧ నేటిసాయంకాలము అతనిస్వగ్రామమగు సామిడిలో అనేకమంది హిందూముసల్మానుసభ్యుల ఎదురుగా యుద్ధవ్యతిరేక కేకలనుచ్చరించి సత్యాగ్రహమొనర్చెను. పోలీసువారు అరెస్టుచేసి గుత్తికి తీసికొనిపోయిరి.

## కోర్టులేచేవరకు శిక్షలు

జనవరి౨౭వతేది బెజవాడలో సత్యాగ్రహముచేసిన వాంగ్రాసీఅప్పలస్వామి, పోతిని వెంకన్నగారికేసులు బెజవాడసబుకలెక్టరుగారు క్యాంపుచేసిన కోడూరుగ్రామములో ౨౯వతేదిన విచారణజరిగి వాంగ్రాసి అప్పలస్వామిగారికి కోర్టు లేచువరకు శిక్ష వేసిరి. పోతినివెంకన్న గారికి పదివారములుకఠినశిక్ష నూరు రూపాయీలు జుర్మానా, అదిచెల్లించనిచో ఒకనెల కఠినశిక్షవిధించిరి.

చిత్తూరు మునిసిపల్ కౌన్సిలరున్న చిత్తూరు పట్టణ కాంగ్రెసుసంఘాధ్యక్షుడుకుఅయిన పుట్టి ఆళ్వారుశెట్టిగారు పుంగనూరుగ్రామములో ౨౫వతేదిఉదయంయుద్ధవ్యతిరేకకేకలు వేసి సత్యాగ్రహముచేసినందున మదనపల్లి జాయింటు మేజస్ట్రేటుగారు కోర్టులేచువరకుకఠినశిక్షయు. రు౫౦లు జుర్మానాయును, అదిచెల్లింపనిచో ౫ నెలలు కఠినశిక్షయు విధించిరి.

## ౧౧ నాలు సత్యాగ్రహం చేసినతర్వాత అరెస్టు

బళ్ళారిజిల్లాలో సత్యాగ్రహము సల్పిన తొమ్మండుగురిలో యొకరైన అలూరు తాలూకు రామదుర్గం హాపన్న చౌదరిగారిని పత్తికొండ తాలూకు తుగ్గలి గ్రామంలో ౨౭-౧-౪౧సాయంత్రం౫-3౦గంటలకు శ్రీ ... స్వామి ఆలయమువద్ద సుమారు రెండునూర్ల జనులయెదుట యుద్ధవ్యతిరేకకేకలువేసినందునఅరెస్టుచేసి డోణ్ డిప్టీకలెక్టరుగారివద్ద హాజర్ పరుపగా ౨౮ తేదిన ౫నెలలుకఠినశిక్ష విధించిరి. యీసత్యాగ్రహి ౧౬-౧-౪౧వరకు 3౦మైళ్లుకాలినడకతో ౯ గ్రామములలో సత్యాగ్రహమొనర్చెను

## తాలూకా కాంగ్రెసు అధ్యక్షుని సత్యాగ్రహము

ఏలూరు తాలూకా కాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ ఉవికిలిసీతారామరాజుగారు ౨౭వతేది సాయంకాలం భీమడోలుగ్రామమందు సత్యాగ్రహమొనర్పగా మరునాటిసాయంకాలం ఏలూరు సబుడివిజనలు మేజస్ట్రేటుగారిచే 3మాసములు కఠినశిక్ష, రు౨౦౦జుర్మానా. అదిచెల్లింపనిచో మరి మూడుమాసములు కఠినశిక్షవిధించిరి.

## ట్రేడుయూనియను నాయకుడు

అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు అధ్యక్షుడు, మధ్యరాష్ట్ర అసెంబ్లీకాంగ్రెసుపార్లమెంటరీ పార్టీకార్యదర్శియగు శ్రీ వి. ఆర్. కాళప్పగారికి జనవరి 3౧వతేదిన ౯ నెలల కఠినశిక్ష, రూ. ౫౦ జుర్మానావిధింపబడెను. శ్రీ కాళప్పగారు విచారణలో పాల్గొనలేదు. శ్రీ కాళప్పగారు సత్యాగ్రహం చేయనుద్దేశించినట్లు నోటీసును జిల్లామెజిస్ట్రేటుకు అందజేసినమీదట వారినిపోలీసువారు జనవరి ౨౧వతేదిని అరెస్టుచేసిరి.

## కాన్పూరు మొదటిస్త్రీ సత్యాగ్రహి

శ్రీమతి ప్రభాదీక్షిత్ గారు కాన్పూరు మొదటి స్త్రీ సత్యాగ్రహి ఈమె నారాయన్పూరు గ్రామంలో సత్యాగ్రహంచేసి అరెస్టుచేయబడిరి.

## సత్యాగ్రహిఖైదీల బేడీలవిషయంలో గుంటూరున్యాయవాదుల ఆక్షేపణ

జనవరి ౨౯వతేదిసాయంత్రం గుంటూరు సబ్ జైలునుండి రాజమండ్రి సెంట్రలు జైలుకుమార్చబడిన రాజకీయఖైదీలకు బేడీలువేసి తీసికొనివెళ్ళిరి. ఈసందర్భములో గుంటూరున్యాయవాది సంఘపుఅధ్యక్షుడు, మరికొంతమంది న్యాయవాదులు పోలీసుసూపరింటెంటుగారిని దర్శించి ఇదిఅన్యాయమనియు, ఇట్టిపనిచేయుట అనవసరమనియు తెలయచేయగా సూపరింటెంటుగారు ఆలోచించెదమని చెప్పిరట.

## తాలూకాకాంగ్రెసుఅధ్యక్షునకుశిక్ష

కల్యాణదుర్గంతాలూకా, కాంగ్రెసుఅధ్యక్షుడగు శెట్టూరుయజమాన నారాయణశర్మగారు 3౦-౧-౪౧ తేదీనకల్యాణగర్గంలో సత్యాగ్రహమొనర్చిరి. పోలీసువారు అరెస్టుచేసినతర్వాత అనంతపురం డిప్యూటీకలెక్టరుగారు విచారణజరిపి ౪ నెలలకఠినశిక్షవిధించిరి. ఈదినం బళ్లారి జైలుకుగొంపోయిరి.

## ముసల్మానుసత్యాగ్రహులఅరెస్టు

పల్నాటిప్రాంతములో మొట్టమొదటి ముసల్మానుసత్యాగ్రహి శ్రీసయ్యదుజాన్ గారు వీరు ఇచటికి ఏడుమైళ్ళదూరములోని తమస్వగ్రామము దాచేపల్లిలో 3౧ వతేదిఉదయము సత్యాగ్రహముచేసి అరెస్టుఅయిరి.

## సత్యాగ్రహానికై ఉద్యోగంరాజీనామా

సత్యాగ్రహమునందుపాల్గొనుటకు, తెమజిల్లాబోర్డు ఉపాధ్యాయపదవికి రాజీనామానిచ్చిన శ్రీ పల్లాది గౌరీనాథశాస్త్రిగారు జనవరి 3౧ వతేది ఉదయము బాపట్లలో జిల్లామునసబుకోర్టుముందు సత్యాగ్రహమునుచేసి అరెస్టుఅయిరి.

## ఒరిస్సాలోఅరెస్టులలెక్క

సత్యాగ్రహోద్యమం ప్రారంభమైనప్పటినుండి ఒరిస్సారాష్ట్రములో మొత్తముమీద ౨౫3 మంది అరెస్టుఅయినట్లు రాష్ట్రీయకాంగ్రెసుసంఘపులెక్కలవల్ల తెలుస్తున్నది. వీరిలో ౧౭౭ మంది కట్టకంజిల్లానుండి ౫౪ మంది కోరపుటెజిల్లానుండి అరెస్టుఅయిరి,

## బెంగాలులో అరెస్టులు లేవు

బెంగాలురాష్ట్రంలో హుగ్లీజిల్లా కాంగ్రెసుసంఘ అధ్యక్షుడును, హుగ్లీ చిన్సురా మునిసిపాలిటీ అధ్యక్షుడునునగు శ్రీ నాగేంద్రనాథ్ ముఖర్జిగారు బరడంగల్‌లో జనవరి ౨౦ తేది మధ్యాన్నము సత్యాగ్రహము చేసినందుకు అరెస్టుచేయబడిరి. వారికి మర్నాడు ఒక సం॥ విడిఖైదు విధించబడెను. కలకత్తా హౌరాలలో పలుస్థలములందు అనేక కాంగ్రెసువాదులు యుద్ధప్రతికూల కేకలువేసి సత్యాగ్రహాలు చేసినను ఎవరును అరెస్టు చేయబడలేదు.

# మొహరంలో సత్యాగ్రహం

## మహమ్మదీయులు మానవచ్చును

వర్ధా, జనవరి ౨౮

మొహరంలో సత్యాగ్రహం నిలుపుచేయవలెనని ఇంకా ఆజ్ఞలురాలేదు.

ముసల్మానులు ఆరోజులలో సత్యాగ్రహం చేయడం తమకిష్టంలేకపోయినట్లైతే మానివేయవచ్చునని మాత్రం తెలుపబడినది.

# కాంగ్రెసు సభ్యు లెక్కువగాలేని స్థానిక సంస్థలు

## గాంధీ మహాత్ముని ఆజ్ఞ.

మదరాసు కార్పొరేషన్లో కాంగ్రెసు పక్ష సభ్యులు ఎక్కువలేనందుచే యుద్ధనిధికై రు 10000 చందాధనమును మంజూరుకాకుండ ఆపలేకపోయిరి. ఇట్టిపరిస్థితులయందు మిగిలియున్న కాంగ్రెసుసభ్యులు రాజీనామాను ఇవ్వవలసినదిగా గాంధీమహాత్ముని అభిప్రాయమున్నట్లు తెలియుచున్నది. ఉత్తరవువచ్చినతోడనే రాజీనామానిచ్చుటకు ౧౭గురు సభ్యులు సిద్ధంగానున్నారు. డా॥ పట్టాభి సీతారామయ్యగారు మహాత్ముని చూచివచ్చిరి, వారిని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘ కార్యదర్శియగు కళా వెంకటరావుగారు సందర్శించి ఈ వార్తను గొనివచ్చిరి. కార్పొరేషనుపార్టీ నాయకులగు డా॥ యు. కృష్ణారావుగారితో కళా వెంకటరావుగారు ఈ విషయమై సంభాషించెదరు. తమిళరాష్ట్ర సంఘాధ్యక్షులగు వి. ఎం. ఒబేదుల్లాగారు ఇదివరలోనే డా॥ కృష్ణారావుగారితో ఈ విషయంలో ముచ్చటించిరి.

## రాట్నముపైవడకనివారి సత్యాగ్రహార్హత

శ్రీ ప్రూర్ణానందంగారు సత్యాగ్రహమొనర్చుటకై అనుమతికి గాంధీగారికివ్రాయగా సంపూర్ణారోగ్యమందుండి రాట్నమువడకనివారలు సత్యాగ్రహమొనర్చుటకుతగరుకావున, వెంటనేరాటము వడకుటకారంభించవలసినదిగా ప్రత్యుత్తరమిచ్చినట్లు తెలియవచ్చినది.

## సత్యాగ్రహఖైదీలకు బేడీలు

జనవరి3౧వతేది తెల్లవారుజాము ప్యాసింజరులో సుమారు ౪౦మంది సత్యాగ్రహఖైదీలను గుంటూరు, బెజవాడ ప్రాంతమునుండి రాజమండ్రి సెంట్రలుజెయిలుకు తీసికొనివచ్చిరి. వీరందరికి బేడీలు వేసినారు.

## లిండీసంస్థానం ప్రత్తిని కొనవద్దు

ప్రజలపై ఆ సంస్థానాధికారి నిర్దాక్షిణ్యమునకు ప్రతిక్రియ

డా॥ పట్టాభి సీతారామయ్యగారి ప్రకటన

మచిలీపట్టణం, జనవరి ౨౭

భారతదేశంలో ప్రజలందరు యీసంవత్సరం కూడా కథియవాడలో లిండీ సంస్థానంనుంచి వచ్చేప్రత్తిని కొనగూడదు—అనే ప్రకటనను ఆంధ్ర రాష్ట్రీ కాంగ్రెసుసంఘాధ్యక్షులైన డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులుగారు చేసినారు. దానిలో యిట్లు వివరించినారు:-

"ఈసంస్థానాధిపతి చనిపోయి నాలుగునెలలుమాత్రమే అయినది. ఈసంస్థానాధిపతిపెద్దకొడుకు సంస్థానాధిపతిఅయినాడు. ఈ నాలుగు నెలలలోపలనే ఆయనకూడా చనిపోయినాడు. ఆయనతండ్రి జీవించివున్నప్పుడుకూడా పెద్ద కొడుకే సంస్థానవ్యవహారాలనన్నిటిని చూచేవాడు. ఆయనకు ముగ్గురుతమ్ములున్నారు. ఈ పెద్దకొడుకు అధికారిగావున్నప్పుడే ఆసంస్థానంలో చాలాదారుణకృత్యాలు జరిగెను. అందువల్లఆసంస్థానంలోనిప్రత్తిని దేశీయులందరు బహిష్కరించారు, రెండేళ్ళనుంచి యీప్రత్తి నెవరుకొనడంలేదు. ఈపెద్దకొడుకుకొక కొడుకున్నాడు. అతడు మైనరు. ఈమైనరు తాతబతికున్నప్పుడు మైనరుతండ్రికిఅతనితండ్రి పవరుఆఫ్ఆటర్నీయిచ్చెను. మైనరు పెద్దపినతండ్రి సంస్థానంలో హైకోర్టుజడ్జీగావున్నాడు. మైనరుమూడవపినతండ్రి దివానుగా వున్నాడు. పెద్దకొడుకుకొడుకుకు మైనారిటీ వదలువరకు ఇండియాప్రభుత్వమువారే యీసంస్థానమును పరిపాలించుచున్నారు. ఇప్పుడు హైకోర్టుజడ్జీగాను, దివానుగానువున్నవారిటుపైనకూడా యీపదవులలోనే వుందురనిచెప్ప వీలులేదు. ఈ ఈసంస్థానప్రజలలో ౧౫౦౦మంది యిప్పుడుకూడా సంస్థానంవెలుపల నేవున్నారు. ప్రజలను సంస్థానముఅధికారులు చాలాబాధ పెట్టుచుండుటవల్ల పోయిన రెండేళ్ళలోను వీరిసంస్థానంలో ఒకపత్తిబేలునైనా ఇండియాలో అమ్మగలిగివుండలేదు. వీరుచాలాప్రత్తిని జపానుదేశమువారికి అమ్మిరి. అనేక కారణాలవల్ల యీప్రత్తినికొనవద్దని భారతనాయకులు జపానుదేశంలో ప్రచారం చేయవీలులేకపోయినది. ఇటుపైనకూడా ప్రజల యిబ్బందులుతొలిగేలాగు కనబడుటలేదు ముందునెలలలో యీసంస్థానములో చేలలోపండినపత్తినితీయుట ప్రారంభమగును. గనుక భారతీయులందరు పోయినరెండేళ్ళలోను ఈసంస్థానం ప్రత్తిని యెట్లుబహిష్కరించారో అట్లే ౧౯౪౧ లోకూడా పూర్తిగాబహిష్కరించవలెను. యిప్పుడు వెనుకటిలాగ జపానుకు యిండియానుంచి స్టీమరుల రాకపోకలు జరగడంలేదు. అందువల్ల జపానువారీసంవత్సరం యీసంస్థానం ప్రత్తిని హెచ్చుగాకొనజాలరు."

## తిలకుగారి కుమారుని నిరశన వ్రతము

పూనా, జనవరి ౨౯

ఇటీవల కేసరీ, మహారాటాపత్రికల ట్రస్టుబోర్డువారి వ్యాజ్యమునాడి గాపించియుండిన ప్రకటనలకు ప్రత్యుత్తరమొసంగుచు తాను మరణించినను నిరశనవ్రతము మానజాలనని ఆర్ బి తిలకుగారు చెప్పుచున్నారు. వీలునామా ఎక్జిక్యూటర్ హోదాలో తానవారిని బర్తర్ఫు చేసియుండెనని ఆయన చెప్పుచున్నాడు ప్రస్తుత ట్రస్టీలు స్వయంగా రాజీనామానిచ్చి అస్తినికాంగ్రెసుకు వశపరుపవలెను. లేదా, కాంగ్రెసువారువావాచేసి ప్రస్తుత ట్రస్టీలను తొలగింప ప్రయత్నింపవలెను. ఈరెంటిలో నేదోఒకటి జరిగినప్పుడే తాను నిరశనవ్రతమునూనగలను—అని ఆయనచెప్పెను. తిలకుగారు ౧౭రోజులనుండియు నిరశనవ్రతము చేయుచున్నారు. ఆయన తిరుగగలిగియున్నాడు. కాని ౧౫ పౌనులబరువు తగ్గిపోయెను.

## నిజాంగవర్న మెంటు బస్సులలో ప్యాసింజరుల కష్టములు

నేను ఈనెల౨౧వతారీఖున వ్యాపర్ల స్టేషన్ నుండి కొల్లాపురంసంస్థానములోచేరిన పెంట్లవెలిస్టేషన్ వరకు ప్రయాణమై రాత్రి ౮ గంటలవుడు మోటారుసెక్కినని. షుమారు ౨౫ ఫర్లాంగులువెళ్ళునరి బస్సులోని కండక్టరు నన్ను టికెట్టు డబ్బుఅడుగగా నిచ్చి టికెట్టుకోరితిని. యుద్ధమునకు నొకపైసానివ్వుమని నన్ను అడిగెను. అంటనాతావున పైసా లేకుండెను. యివ్వనిమిత్తే దంటిని నన్ను మోటారుదిగమని బస్సును నిలపెటైను. చాలాచీకటిగానుండెను.. మార్గము కానరాకుండెను. పాపము ఒక ప్యాసింజరు పైసానిచ్చి బస్సుప్రయాణము సాగించెను లేనిచో నేను ఆరాత్రి చాలా శ్రమపడవలసివచ్చెడిది.

ఆత్మకూరు, కర్నూలుజిల్లా    ౨౭—౧—౫౦ఫసలీ.

ఓరుగంటి పుల్లయ్యశర్మ.

## మదరాసులో ఏ. బి. తరగతులేకంచేయుట

రాజకీయ ఖైదీలస్థితి మార్పు.

మదరాసు, జనవరి౩౦

మదరాసురాష్ట్రమునందు వివిధజెయిళ్లయందున్న రాజకీయఖైదీలలో ఏ బి. తరగతి వ్యత్యాసములను ప్రభుత్వమువారు తొలగింపనిశ్చయించిరి. ఆహారము, లేఖలు. సందర్శనసౌకర్యములు, యితరవస్తుసామగ్రి వస్త్రములవిషయము లన్నింటియందు వీరందరికిఒకే విధంగానుండును. కాని జెయిళ్లలో నలసంకోశముచేత కుర్చీలు బల్లలు మున్నగు (ఫర్నిచరు)వస్తువులు ఏతరగతివారికి ఎక్కువగ నందవచ్చును.

## బడిపిల్లల జీతములతోబాటు యుద్ధనిధివసూలు

తలకొక అణా స్వచ్ఛందవిరాళము

పశ్చిమజిల్లా యుద్ధసంఘపు తీర్మానము

ఏలూరు, జనవరి ౨౯:....

నేటిసాయంకాలం జిల్లాకలెక్టరు కార్యాలయమందు కలెక్టరుగారైన శ్రీ జి. ఎం. ఫ్రేజరుగారి ఆధ్యక్షతనుజరిగిన జిల్లాయుద్ధసంఘ కార్యనిర్వాహక సభయందు యీక్రింది తీర్మానములు గావింపబడెను.

జిల్లాలో గ్రామములలో జరుగుచున్న యుద్ధవ్యతిరేక ప్రచారము నెదుర్కొనటకవసరము గనుకనూ, జిల్లాయుద్ధప్రచార సంఘసభ్యులు యితరపనులుగలవారుగనుక వారు కావలసినంతకాలము ప్రచారనిమిత్తం పని చేయజాలనందువలననూ, ఈజిల్లాకొక ప్రచారపుఉద్యోగిని వేతనముపైనియమింపవలెనని తీర్మానించుచున్నారు.

జిల్లాలో పాఠశాలలలోచదువుచున్న విద్యార్థులవద్దనుండి ప్రతినెలబడిజీతములతోబాటు ఒక అణా యుద్ధనిధికి స్వచ్ఛందవిరాళముక్రింద వసూలుచేయుటకు ఏర్పాటుచేయవలసినదిగా విద్యాశాఖాధికారులను గోరుటకు తీర్మానించుటయైనది. ఈతీర్మానము ఏలూరుపురపాలక సంఘమునకు, పాలకొల్లుపురపాలక సంఘమునకు, జిల్లాబోర్డువారికి పంపగలందులకు కూడకోరడమైనది.    [ఆ ప్రభపత్రిక]

## జయప్రకాశ నారాయణ గారి అరెస్టు

బొంబాయి, జనవరి ౩౦

అఖిలభారత కాంగ్రెసుసోషలిస్టుపార్టీ కార్యదర్శి జయప్రకాశ నారాయణగారిని సంయుక్తరాష్ట్రీ ప్రభుత్వమువారు జారీచేసినవారంటు ననుసరించి బొంబాయిపోలీసువారు నేటిదినం అరెస్టుచేసిరి.



..మనభట్ట నాంబయ్య
శ్రీలక్ష్మీనరసింహ ఫోటోకంఠని
ధర్మపురి—తీరుప్రరోహిత్
ధర్మప్రకాశోస్టు నిజాంస్టేట్
మంచిర్యాల స్టేషన్

ఒక ప్రతి
అయిదు కాసులు
3 రూపాయలు
బ్రిటిషిండియాలో
సంవత్సరమునకు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

*Volume* **15** **Hyderabad-Dn.** **Thursday 6 February 1941** *Number* **76**

## అమెరికాకు హిట్లరు బెదరింపు

### బ్రిటనుకు సహాయముచేయుచో, అమెరికను నావలను ముంచివేతుము

రాబోవు వేసవిలో బ్రిటిషునౌకలపై దెబ్బ

హిట్లరు తానధికారమునకువచ్చి ఎనిమిదేండ్లయినదన్న సంగతిని స్మరించుటకు జనవరి 30వ తేదీ జరిగినమహోత్సవము సందర్భమున బర్లినులో ఉపన్యసించుచు విట్లుగర్జించిరి:-

హిట్లరు పూర్వపుగాథలమత్రవ్వుచు తమ ఉపన్యాసమును ప్రారంభించిరి:-యుద్ధమునకు కారకులెవరుఅని పరిశీలించుటకు రూజ్వెల్టుగారు నియమించినవిపుణులు, జర్మనీ కారణము కాదని నిర్ణయించిరి. 300ఏండ్లు పౌర్జన్య మువయోగించి బ్రిటను సామ్రాజ్యము ఏర్పరచుకొన్నది. ఇతరదేశము లనుజయించుటకు బ్రిటను ఎన్నో యుద్ధములు చేసెను. ప్రపంచమునంతటినిజయించి తనసామ్రాజ్యముగాచేసికొనవలెనని బ్రిటనుకుపుట్టినఆశకు నూతనశక్తిసంపాదించుకొనుచు బలపడుచున్న జర్మనీ మొదలగు యూరోపీయదేశములవల్ల విఘాత మేర్పడెను. 1914వ సంవత్సరపు యుద్ధమునకును ఇప్పటి యుద్ధమునకును ఇదేకారణము. గతయుద్ధములో బ్రిటను జర్మనీనిజయించగలుగలేదు కాని అంతరంగికపరిస్థితులు సరిగా లేకపోవుటవల్ల జర్మనీ లొంగిపోవలసివచ్చెను. అప్పటిజర్మనీవేరు, ఇప్పటిజర్మనివేరు. అప్పుడు జర్మనీలో ప్రజాస్వామికము నెలకొనియుండెను. సోషలిష్టు ప్రభుత్వపద్ధతి, జాతీయ(నేషనలిస్టు) ప్రభుత్వపద్ధతి ఇవిరెండే ఫలవంతమగుప్రభుత్వపద్ధతులు, కాని ఇంతకాలమూ ఈరెండుపద్ధతులను అభిమానించువారు పోట్లాడుకొనుచుండిరి. ఇప్పుడువారిద్దరికి స్నేహముకుదురునట్లుచేయగలిగితిమి. ఈరెండుపద్ధతులసమన్వయమే జర్మనీలోని నేషనల్ సోషలిస్టు ప్రభుత్వము. నాజీపార్టీ ఈప్రభుత్వమును ఏర్పరుపగలిగెను. ఇదివరకు ప్రజాస్వామికములోనున్న లోట్లన్నియు ఇందువల్లతీరిపోయినవి. నాజీపార్టీలో చేరవలెనని ఎవ్వరిని బలవంతముచేయులేదు. కాబట్టి బలవంతమేమాత్రమునులేని ప్రజాస్వామిక పద్ధతులవల్లనే అప్పటి ప్రజాస్వామికమును అణచివేయగలిగితిమి ఇప్పుడు నాకుగల గొప్పఅధికారములు ప్రజలిచ్చినవే.

### జర్మనీకోర్కె

గతయుద్ధాంతమున చేసికొన్న వర్సెయిల్స్ సంధి జర్మనీకిఅవమానకరము గనుక దానిని రద్దుచేయవలసినదని జర్మనీకోరినది. నేనుచేసిన అనేకఉపన్యాసములలో దీని నేవ్యక్తపరచితిని. కాని జాతిసమితి ఈకోరికనుఅంగీకరించకపోయిన ముణిగిపోవునదేమిఆని నిర్లక్ష్యమొనరించెను. ధనవంతులగు యూదులును, తమదేశములనుండిపారిపోయి ఇతరదేశములలో తలదాచుకొనువారి ఆశలును వర్సెయిల్సుసంధిపత్రమును రద్దుచేయుటకు ఆటంకముగానిలిచెను. బ్రిటనుతో తగాదాకు నాకెట్టికారణమునులేదు. బ్రిటను దక్షిణాఫ్రికాలోని కాలనీలను జర్మనీదగ్గరనుండితీసికొనెను. దానిని ఇచ్చివేయవలెననికోరుచుంటిమి. అంతేగాని ఆవిషయమై ఎట్టిపట్టుదలచూపలేదు. ఆకాలనీలవల్ల బ్రిటనుకు లాభమేమియులేదు ఐనప్పటికిని లోభివానివలెనె పట్టుదలచూపుచు, బ్రిటను వాటిని వదలుకొనుటకిష్టపడుటలేదు సంఘముఏరీతిగా నడుపవలెనను విషయమున నాజీపార్టీవారిసిద్ధాంతములనే బ్రిటిషు కార్మికనాయకులిప్పుడు అనుసరించుచున్నారు. యుద్ధము ఎక్కువకాలముకొనసాగునో బ్రిటనుకుతీరనినష్టముకలుగును. జర్మనీలోని పద్ధతులను నేర్చుకొనుటకు బ్రిటనుఇచ్చటికి తనప్రతినిధులను పంపవలసివచ్చును.

ఫ్రాన్సు బెల్జియముల పతనానంతరము సంధిచేసికొనవలెనని బ్రిటనుకు నేనుసూచించగా బ్రిటను ఆసూచనను గర్హించెను.

### అమెరికాకు హెచ్చరిక

అమెరికా బ్రిటనుకుసహాయముచేయుట మానుకొనవలెను బ్రిటనుకుసహాయముచేయు దేశముల నావలను కనబడినపుడెల్ల ముంచివేయుటకు సంసిద్ధముగానున్నాము.. అన్నసంగతి ముందుగా గుర్తెరుగుటమంచిది. అమెరికా ... యూరోపుయుద్ధములో ప్రవేశించునో అట్టిప్రయత్నమునప్రతిఘటించుట ముఖ్యాంశముగా నుండునట్లుగా మాకార్యక్రమమును మార్చుకొందుము అమెరికాపట్ల ఇప్పుడుమాపుచున్నగౌరవము అప్పుడుమాపుటకు వలనుపడదు. అమెరికారాజ్యములజోక్యమును యూరోపు తప్పక ప్రతిఘటించును.

### బ్రిటిషువారి భేదతంత్రము

ఇటలీజర్మనీలమధ్య విభేదములు కలవనియు, ఇటలీజర్మనీనివదలి ప్రత్యేకముగా సంధిచేసికొనువనియు బ్రిటనుచేయుచున్నప్రచారము ఫలవంతముకానేరదు. నేను ముసోలినీయూదులముగాని మార్వాడీలముకాని, స్వలాభపరులముకానికాము. బేరములాడువర్తకులముకాము. ఆత్మగౌరవము, మాటనమ్మకముగలవారము. మాస్నేహమును చెడగొట్టుప్రయత్నమువ్యర్థము. ఇటలీలోఅంతఃకలహములు పుట్టించుప్రచారముగూడ వ్యర్థమే. ఇటలీకితటస్థించిన కొద్దిఅపజయములవల్ల తమకువిజయముచేకూరినట్లు బ్రిటిషువారుభావించుట పరిహాసాస్పదము జర్మనుప్రజలకు, నాజీప్రభుత్వమునకు భేదము తెచ్చిపెట్టగలచుట అంతకన్న తెలివితక్కువ. ఆకాలముగడిచిపోయినది.

### ఈసంవత్సరపు యుద్ధము

క్రొత్తసంవత్సరమువచ్చినది. జర్మనీకిఇప్పుడున్నంతఆయుధసంపత్తి ఇదివరకెన్నడునులేదు. ఈవేసవిలో జలాంతర్గాములతో యుద్ధముసాగింతుము, ఇన్నాళ్లు జర్మనీనిద్రపోవుచుండలేదని మాశత్రువులిప్పుడుగ్రహింపగలుగుదురు బ్రిటనుమీద దెబ్బకొట్టుటకు ఏదారికనబడిన ఆదారి త్రొక్కుదురుగాని జర్మనులు ఏమాత్రమువెనుదీయరు. విజయములభించుననునిశ్చయముమాకు కలదు.

### బ్రిటనుపనిచేయును

బ్రిటనుఎచ్చటనో గొప్పయుద్ధముప్రారంభించునట్లుచెప్పుచున్నది. ఆప్రదేశమేదియో ముందుగా తెలిసినచో ఆప్రదేశమునుఖాళీచేయించి బ్రిటిషువారిసేనలను దింపుటకుఆటంకములేకుండ చేసెదను. జర్మను పౌరుషము తేటతెల్లమగునట్లుచేసెదను. యూరోపులో మేముస్థిరపడియున్నాము, మమ్ములనెవ్వరును కదలింపజాలరు తగినచోట్ల విమానాశ్రయములను, నౌకాశ్రయములను నిర్మించుకొనియున్నాము. సమయమురాగానే జర్మనులు శత్రువుపై విజృంభింపగలరు. అమెరికా బ్రిటనుకు సహాయముచేయుననుసంగతి మేముముందేలెక్కలోకి తీసికొని తగినప్రతిక్రియలూహించితిమి అమెరికాను ఆక్రమించవలెనని జర్మనీ కలలోనైనను తలంచుటలేదు.

హిట్లరు ఉపన్యాసానంతరము గబెల్సుగారు "హిట్లరుఆజ్ఞప్రకారము నడిచెదము" అనిబిగ్గరగాపలికిరి.

హిట్లరుపన్యాసము బడాయిమాటలని బ్రిటిషుపత్రికలన్నియు విమర్శించినవి.

అమెరికాసంయుక్తరాష్ట్రపు సెనేటు సెనెక్కువిదేశాంగ వ్యవహారస్థాయిసంఘములో సభ్యులగు సెనేటరుగ్లాసుగారు హిట్లరుఉపన్యాసమునుగూర్చి, "అంతర్జాతీయసూత్రములను మీరకుండ ఏదేశములకు మననౌకలనుపంపవలెను

## తోకచుక్క

కొలంబో, ఫిబ్రవరి ...

కొలంబోలో జనవరి 31వ తేదిరాత్రి 8 గంటల 15 నిమిషాలకు తోకచుక్కఒకటికనపించి 2 గంటలకు అస్తమించినది. అందరును చూచినట్లు చెప్పలేదుగాని కొందరుమాత్రము చూచినట్లు చెప్పుచున్నారు సింహళ జ్యోతిశ్శాస్త్రపరిశోధక సంఘకార్యదర్శి బ్రిటోగారుఈతోకచుక్కను చూచిరి. దిగంతరేఖకు (హొరైజన్) ... డిగ్రీలకుపైగా ఇదికనుపించినది. సరిగా ... దేవేళ ఫిబ్రవరి 1వతారీఖున కనుపించినది ఎకర్నార్, ఫోమల్ హాట్ ల మధ్యదక్షిణముగా ఇదికనపడెను. ఈతోకచుక్క త ల పై పు పై రెండునక్షత్రాల కాంతిలో సగముకాంతి ఉన్నది, తోక ఎకర్నారుపై పుతీరిగి ప్రకాశించుచుండెను. 1వతారీఖున ఆకాశం నిర్మలంకాగానే అన్నినక్షత్రాలతోబాటు ఇదియుప్రకాశించినది. వందలకొలది జనము విరగబడిచూచెను.

### తిరుచునాపల్లి, మదరాసులో

ఫిబ్రవరి 3వతేదిరాత్రి 2½గంటలనుండి 3గంటలమధ్య తిరుచునాపల్లిలో ఆకాశమందు తోకచుక్క నైరుతిమూలగా కనుపించెను. కొలంబోలోను, న్యూజీలెండులో కనిపించినట్టిదేఇది అనుకొనిరి. మదరాసునగరంలో ఆదేరాత్రి 2గం॥లనుండి 3గంటలమధ్య దక్షిణనైరుతి దిశలలో పెద్దతోకగల చుక్క కనుపించెను. 3 గంటలతర్వాత ఇది కనుపించలేదు.

దో ఆయాచోట్లకు మననావలను నిర్భీతిగాపంపవలెను. అడ్డుపడినవారికి మనఆయుధబలమునుయొక్కరుచిచూపి తగినరీతిగా బుద్ధిచెప్పవలెను" అనివాదించెను.

స్థాయిసంఘసభ్యులలో మరొకరగు సెనేటరు నైగారు, "జర్మనీ బెదిరించుచున్నదిగనుక బ్రిటనుకు ఆయుధసహాయముచేయు బిల్లును చట్టముచేయరాదనుచున్నారు. మనవావలను ముంచుచో రేపుజర్మనీ యుద్ధముప్రకటించునని వీరిభయము



## భారతరాజకీయ ప్రతిష్టంభనము

### పార్లమెంటు కామన్సుసభలో ఇండియామంత్రికిప్రశ్నలు

బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో జనవరి 30వతేది "భారతదేశరాజ్యాంగాభివృద్ధి విషయమున బ్రిటిషుప్రభుత్వమువారు తమపరిస్థితిని స్పష్టముగానిర్వచించియుండిరి. అదియింకను వర్తించుచున్నది. అని కేరీగారిప్రశ్నకు ప్రత్యుత్తరమొసంగుచు కామన్సుసభలో ఇండియామంత్రి అమెరీగారు ప్రకటించిరి,

వైస్రాయిగారికిని భారతదేశనాయకులకును జరుగుచుండిన చర్చలు ఆపుచేయబడినవిగనుక భారతదేశమునందలి క్లిష్టరాజకీయస్థితిని తొలగించుటకు వెంటనే ఆచరణయోగ్యమగు నెట్టిచర్యలైన కొనబడునని కేరీగారడిగిరి.

భారతీయులకు ఒడంబడికకుదురుచో ఆఒడంబడికను అమలుచేయవీలగును. కాని భారతదేశములో వివిధపక్షాలవారికిని ఒడంబడికకుదుర్చుటకు బ్రిటిషుప్రభుత్వమువారు ప్రస్తుతమునైకొనదగిన చర్యయేమియులేదని నేనుతలతునుఅని అమెరీగారుచెప్పిరి.

కేరీగారు: స్థితిగతులను చక్కబరచుటకై ఈదేశమునుండి సద్భావరాయబారమును నొకదానినిపంపుటఉచితమాయను విషయమును అమెరీగారువిచారింతురా?

అమెరీ: భారతీయులలో భారతీయులకు సద్భావమవసరము. ఇట్టిసద్భావమునుకలుగజేయుటకు యిక్కడినుండివెళ్ళు సద్భావరాయబారమువలన ప్రయోజనముండునని నేనుతలపను.

### సోరెన్సనుగారిప్రశ్నలు

భారతదేశమునందలి రాజకీయపరిస్థితులవిషయమై అమెరీగారు మరియొకప్రకటన చేయవీలగునాయని సోరెన్సనుగారడుగగా, జనవరి ...గతేదినిచేయబడినప్రశ్నలకు యిచ్చినప్రత్యుత్తరము తప్ప మరేమియు తాముచెప్పదగినదిలేదని అమెరీగారుచెప్పిరి.

### రాజకీయఖైదీలసమస్య

రాజకీయనేరములకై శిక్షింపబడినవారిసంఖ్యయెంతని సోరెన్సనుగారడిగిరి.

అమెరీగారు: యుద్ధప్రతికూలప్రచారమునకై యెంతమంది భారతదేశరక్షణనియమాలననుసరించి శిక్షింపబడిరని సోరెన్సనుగారడుగుచున్నట్లూహింతును. ఇప్పుడుశిక్షల ననుభవించుచున్నవారి మొత్తముసంఖ్య నేనుచెప్పజాలను. కాని గాంధిగారు సత్యాగ్రహోద్యమము ప్రారంభించినప్పటినుండియు జనవరి 11వతారీఖువరకు ...మంది ఖైదుచేయబడిరి. ఇప్పటికివీరిలో కొందరిశిక్షాకాలముపూర్తియైయుండును, వీరిలోచాలయెక్కువమంది ఐచ్ఛికముగా కారాగారములలోనికి వెళ్లిరని సోరెన్సనుగారికి నేనుజ్ఞాపకముచేయవలసియున్నది.

### మొదటిపేజీ తరువాయి

వతేదినుండి 3గవతేదివరకు చిక్కువ ప్రదేశాలలో ముఖ్యములైనవి జనవరి 31వతేదిన రెండుఇటాలీయ సైనికదళములకు వాటిమూలస్థానముతో గలసంబంధమువిచ్ఛిన్నముచేయబడినది. ఉత్తరరంగంలో జనవరి 31వతేదిన గొప్పపోరాటము క్రొత్తగా ప్రారంభించబడినది. 3గవతేదిన "1200" అనేపేరుగల ఒకముఖ్యపర్వతశిఖరమును గ్రీకులు పట్టుకొనిరి.

ఈపోరాటములన్నిటిలోను ఇటాలీయులయుద్ధసామగ్రి ఎంతయో గ్రీకులవశమైనది గ్రీసుపైఇటాలీయవిమానాలు చేసినదాడులవల్ల పోయినడిశంబరునెలలో 26మందిజనులు మరణించిరి, 73మందికి గాయాలయ్యెను 1200ఇండ్లు పూర్తిగాను 3000ఇండ్లుకొద్దిగాను నాశమయ్యెను.

బ్రిటిషువిమానాలు అల్బేనియాలో ఇటాలీయసేనల స్థానాలపైకిపోయి బాంబులువేయుచు నష్టపరచుచున్నవి. వాటిలోనాపై ఫిబ్రవరి 1వతేది తెపెలినికిఈశాన్యమున దుకాణాలపై జనవరి 31వతేదిన బాంబులువేసి నష్టము కలిగించినవి.

### ఇటాలీయనౌకల నష్టాలు

ఇక కొన్ని ఇటాలీయనౌకల నష్టాలు గనునింప వలసియున్నవి. ఇటలీనుండి అల్బేనియాకుపోవుచుండిన ఒకఇటాలీయనౌకపై జనవరి 30వతేదిన ఏదియో ఒకజలాంతర్గామినుండి టార్పెడో దెబ్బలువేయబడినవి జనవరి 31వతేదినాటిరాత్రి బ్రిండిసిపైపు ఒకఇటాలీయనౌక గ్రీకు జలాంతర్గామినుండివచ్చిన టార్పెడోదెబ్బలచే మునిగిపోయెను ఇదే గ్రీకుజలాంతర్గామి మూడుఇటాలీయుల సేనలఓడలపై టార్పెడో దెబ్బలను వేసినది

### సైనికోద్యోగులకై ఇటాలియమంత్రులు

ఇటలీవారు బ్రిటనుతోను, గ్రీసుతోనుయుద్ధములో కొందరు గొప్ప సైనికాధికారులను పోగొట్టుకొనినారు. మరికొందరు సైనికాధికారులు, ఇటలీపక్షము రెండువైపుల ఓడుచున్నందువల్ల, అధికారాలనుండి తొలగించబడినారు. అందుచే సైనికాధికారులకు కరువేర్పడినట్లున్నది ఇప్పుడు వరుసగా ఒకరితరువాతఒకరుగా మంత్రులు సైనికోద్యోగాలకై తరలిపోవుచున్నారు.

### లిబియాపై జర్మనువిమానాలు

సిసిలీదీవిలో స్థావరాలేర్పరచుకొన్న జర్మనువిమానాలు అయిదురోజులనుండి లిబియాపైకిపోయి బ్రిటిషుసేనలపై బాంబులను వేయుచున్నట్లు వార్తలువచ్చినవి, సోలం, బార్డియాలపై బాంబులువేయబడినవి. ఈవిమానాలకు ఇటాలీయవిమానాలు తోడుగా పోవుచున్నవి.

ఇంకొకసంగతియేమన, మాల్టాదీవిపై జర్మనువిమానాలు సిసిలీనుండిపోయి దాడులు చేయుచున్నవి. జనవరి30వతేది ఉదయము ఇట్టిదాడియొకటిజరిగెను. గాని క్రిందివారికి నష్టమేమియు కలుగలేదు.

### అఫ్ఘనిస్థానములో జర్మనులప్రచారము?

జర్మనులతో ఇపి ఫకీరు సంభాషణలు

బ్రిటిషువారితో ఇపి ఫకీరు వైరము ఎంతమాత్రముతగ్గలేదు, అఫ్ఘనిస్థానమందలి జర్మనులతో ఆతనుఉత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నాడని సరిహద్దురాష్ట్రములో వదంతిగానున్నది. ఇదియిట్లుండ అఫ్ఘనిస్థానమునందలి జర్మనులప్రచారము హెచ్చుచున్నది. జర్మనులకరపత్రములు సరిహద్దుజాతుల రాజ్యములలోనికి హెచ్చుగావచ్చుచున్నవి "ఈదు" వారములో ఇపి ఫకీరు గోర్వేఖ్ లోనుండగా ఏజన్సీలనుండియు అఫ్ఘనిస్థానమునుండియు చాలమందివచ్చి ఆయనతో మాట్లాడిరి

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A B.L.